విశ్వసాహిత్యమాల : 46.

# ది పార్టీ చైర్మన్

(చైనా విప్లవ కథలు)

చున-చాన్-యే.

•

అనువాదం :
మహీధర జగన్మోహన్



విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

# DEPUTY CHAIRMAN. by Chun Chan Ye.

Translated by M. Jagan Mohan.

Avanti Press - Rajahmundry. Q. H. No. 91, E. G.
M. J. M. Rao, Q. H. No. 75, E. G. 500 C.



**Price Rs. 1.**

# స్వ వి ష య ం

విశ్వసాహిత్యమాల 1935 లో ప్రారంభించినది మొదలు యిప్పటివరకు 46 పుస్తకాల్ని ఆంధ్రమహాజనుల కందించివున్నాము. వివిధభాషల్లోని అమూల్య సాహిత్యాన్ని ఆంధ్రీకరించి తద్వారా మనభాషకు నూతనమైన అలంకారాల్ని కూర్చడం యెంతో అవసరం. ఆ పనినే ముఖ్యంగా మేము చేసివున్నాం. నవలలు, నాటకాలు మొదలైన సాహిత్య గ్రంథాల్నేగాక అర్థశాస్త్రం, తత్త్వశాస్త్రం మొద లగు శాస్త్రీయగ్రంథాల్ని కొన్నిటిని కూడా ప్రచురించేము. జీవితచరిత్రలు, బాల సాహిత్యం, దేశచరిత్రలు, సిద్ధాంతగ్రంథాలుకూడ మచ్చున కొకటి రెండు చొప్పున తీసుకరాగల్గేము. గహనమైన శాస్త్రీయ విషయాల్నిగూర్చి అందరికీ సుబోధకంగ వుండేటట్లుగానూ, నూతన శాస్త్రీయ దృక్పథాల్ని ప్రజాసామాన్యంలో పాదుకొనే టట్లు చేయడానికీ పనికివచ్చే గ్రంథాల్ని తీసుకు రాదలచి మొదటిదిగా 'యక్ష ప్రశ్నలు' అనే పుస్తకాన్ని వెలువరచేము. త్వరలోనే 'విశ్వామిత్ర సృష్టి' (ఉద్భిజ్జప్రపంచాన్ని మానవుడు శాసించిన చరిత్ర) 'పంచభూతాలు' (పదార్థవివే కాన్ని గూర్చిన విజ్ఞాన వికాసం) అనే పుస్తకాల్ని తేదలచేము.

పిల్లలకొరకై మన భాషలో పుస్తకాలు కొరతగానే వున్నాయి. మహాత్ముల జీవితవిశేషాల్ని చిన్న కథల రూపంలో తీసుకొని రాదలచేము.

వివిధ భాషల్లోని ఉత్తమ సాహిత్యాన్ని (Classics) సంక్షిప్తరూపంలో ప్రచురించటానిక్కూడా ప్రస్తుతం వెంటనే ప్రయత్నిస్తాము. పెద్ద నవలలు పూర్తిగా ప్రచురించటంలో యెన్నో కష్టాలున్నాయి. మొదటిది ప్రబల సహకారం. అది యిప్పటిలో పెద్ద గ్రంథాల్ని. అందులోనూ విదేశీయ వాతావరణంలో చిత్రించబడ్డ పెద్ద నవలల్ని స్వీకరిస్తుందని తోచదు. ఇటీవల వంగ సాహిత్యం నుంచి అను వాదం చేసి ప్రచురించిన 'శ్రీకాంత' మొదలైన పెద్ద నవలల విషయం వేరు. అవి మన ప్రజల మనస్తత్వంతో సంబంధం గల కథావస్తువును గల్గివుండి తెలుగు చదువరుల నెంతో ఆకర్షించినాయి. యూరోపియన్ నవలా సాహిత్యం అట్లుగాక పాఠకుల మనస్సుల్ని కొంత త్రిప్పట పెడుతుంది. కాలక్రమాన ఆ సాహిత్యాన్ని మన పాఠకులకు పరిచితి చేయగలం. ఈ శతాబ్ది ప్రారంభంలో ఆంధ్రప్రచారిణీ, సరస్వతీ మొదలైన గ్రంథమండలులు యెంతో అనువాద సాహిత్యాన్ని వంగ, మరాఠీ, కన్నడ, హిందీ భాషల్లోని ఎన్నో నవలల్ని తెలుగులోకి తెచ్చేయి. జాతీయభావాలు విజృంభించుతూ, సాంఘిక మూఢాచారాలపైన ప్రజాచైతన్యం

తిరుగుబాటు చేస్తున్న యుగం అది. నేడా కాలం మారింది. 1935 నుంచీ యీ మార్పు ప్రారంభించింది. సామాజిక వ్యవస్థను తారుమారుచేసిన సోవియటు రష్యా శాస్త్రీయ ఆంధ్రప్రజాచైతన్యాన్ని ఆకర్షించింది. అది మొదలుగా రష్యన్ సాహిత్యం తెలుగులో వెలువడుతూంది. 'అమ్మ' 'పిల్ల దున్నేరు' 'నాడు-నేడు' 'ఇంద్రధనస్సు' మొదలైనవి మచ్చుకు కొన్ని మాత్రమే. ఈ ప్రయత్నం యెంత మాత్రం చాలదు. ప్రపంచోపయోగం గల (ప్రపంచపు విలువ) వే గాక అద్వితీయ కళాప్రతిభనూ, సమాజవ్యవస్థయొక్క అవకతవకలనూ పాఠకుల హృదయాల మీద శాశ్వతంగా ముద్రించి మార్గదర్శకం కాగల ఉత్తమసాహిత్యాన్నంతనూ మనం నిర్మించుకోవాల్సి వుంది. అందులో మొదటి మెట్టుగా కొన్ని సంక్షిప్తనవలలను ప్రచురించగలిగేము.

టాల్‌స్టాయ్ మొదలైన సుప్రసిద్ధుల నవలలు ఇటీవల తమిళ భాషలోకి యథాతథంగా అనువాదితములై ప్రచురింపబడుతున్నాయి. ఉదా: 'అన్నాకెరనైనా' (రు 7-8-0) ఇది గమనార్హమైన విషయం. ఎందుకంటే తమిళసోదరుల కృషి ఎంత ముందుకు పోయిందో దీన్నిబట్టే తెలుస్తుంది. తెలుగులో ఈ పరిస్థితి యింకా లేదు. చక్కని అనువాదాలు చేడానికీ, వాటిని అందంగా ప్రచురించడానికీ. వాటిని నాలుగు మూలలకు వ్యాప్తం చేయడానికీ తగు ఐక్య కృషి లేదు. పైగా ఒకరు ప్రచురించిన పుస్తకానికి నకలుగా, పోటీగా మరొకరు అదే పుస్తకాన్ని అంత కంటె అవకతవకగా తీసుకు వస్తున్నారు. ఇదెంతో శోచనీయం. అనువాదకులు, ప్రచురణకర్తలు పోటీదార్లుగా గాక సహకారభావంతో భాషాసేవ చేయాలి.

స్వతంత్ర గ్రంథాల్ని రచించేవాళ్లకి అనువాద సాహిత్యప్రచురణ యెంత మాత్రం ఆటంకం గాదని, పోటీగాదని మనవి చేస్తున్నాము.

ఈ చిన్న పుస్తకంలోని రెండు కథలూ చైనాప్రజల వీరోచిత ప్రతిఘటనా పోరాటాల్ని చిత్రిస్తున్నాయి. అజ్ఞానులై, ఊరూపేరూలేని నిరుపేదలు, నిరాయుధులై తమ అస్తిత్వానికై యెట్లా పోరాడగలరో తెలుపుతుం దిది. నేటి తెలంగాణా ప్రజల ప్రతిఘటనను తలపునకు తెచ్చే యిట్టి కథలు మనకీ నా డెన్నో అవసరం.

31–12–47,<br>
రాజమండ్రి.

ఇట్లు<br>
మహీధర జగన్మోహన్‌రావు.

# డిప్యూటీ ఛైర్మన్

## ౧

ఇంకా డిసెంబరు ప్రారంభంకాలేదు. అప్పుడే మూడురోజులనుంచి మంచేషిటి, బహుదట్టంగా కురుస్తూంది. దీపప్రమిద ముందు కూర్చుని లా ఓ-ల్యూ జమ్ము కాడలతో చెప్పులు అల్లుతూ, అల్లుతూ వాటిని దూరంగాపెట్టేసి దీపంమీద ఒక బుట్ట బోర్లించేడు. గదిఅంతా చీకటి అయిపోయింది. నెమ్మదిగా లేచి, కిటికీదగ్గరకువెళ్ళి, మూసివున్న తలుపులమీద చెవిపెట్టి శ్రద్ధగా విన్నాడు. లోపలా, వెలుపలాకూడ బహు నిశ్శబ్దంగా వుంది. ఆఖరికి వాసాలమీద ఎలుకలుకూడా తిరగడంలేదు. చప్పుడుకాకుండా కిటికీ తెరచి బయటకు చూసేడు. తనగుడిసె చూరు క్రిందనుండి దూరాన పర్వతాలకంటా ఒకటే తెలుపు! దారులన్నీ కప్పడిపోయినాయి; కూరమళ్ళు, పందుల దొడ్లు, పశువుల శాలలు, గాదెలు అన్నీ వూరు వూరంతాకూడా తెల్లని తివాచీ పరిచినట్లుగా కనబడుతూంది. ఇంకా మంచు కురుస్తూనేవుంది. గాలివిసురుకి ఇంతమంచు ఎగిరివచ్చి ముడతలుపడ్డ ఆతని ముఖంమీద పడింది.

మంచు తగలగానే లా ఓ-ల్యూ ఒళ్లు జివ్వుమనిపోయింది. ఆ జివ్వుమనడంకూడా ఆతనికి ఆనందమే కలిగించింది. మంచు దట్టంగా కురిస్తే పంట బాగాపండుతుందని పెద్దలుచెప్పేమాటలు గుర్తుకువచ్చేయి. గతంలో తనకున్న అనుభవంకూడా అంతే. శీతాకాలంలో మంచు దట్టంగాపడిన ఏడాది పంటలుపాడుచేసే లద్దెపురుగులు, మిడతలదండ్లు కనపడవు. కాని.........లాఓ-ల్యూ ఆలోచనలు అంతతో ఆగిపోయాయి. నిరుడుకూడా మంచు బాగాకురిసింది. పంట బాగుంటుందనిపించింది. కాని చివరకు కరువొచ్చి కూర్చుంది. ఆమాట గుర్తుకురాగానే ఆతని హృదయం ఆరాటపడింది. మళ్ళీ నెమ్మదిగా కిటికీ మూసేడు.

ఒక్క నిముషం అక్కడే నిలబడి, బయట యేదన్నా చప్పుడు వినిపిస్తుందేమోనని చెవి ఒగ్గి విన్నాడు. ఎక్కడా చప్పుడులేదు. వీధిలో కుక్కలు కూడా మూతులు కుట్టేసినట్లుగా నోరు మెదపడంలేదు. అటువంటి రాత్రులు సామాన్యంగా చలికి అవి మోరలెత్తి ఏడుస్తాయి. ఈవేళ మాట్లాడడంలేదు. "ఇంతవరకు జపానీ కాపలావాళ్లు రాకుంటే, ఇంక ఈనాటికి రారు" అని నిశ్చయించుకొన్నాడు. ఒక్క నిట్టూర్పు విడిచి ప్రమిదమీద బోర్లించిన బుట్ట తీసేడు. చెకుముకి కొట్టి ఒక్క క్షణంలో వొత్తి వెలిగించేడు. మరల దీపంవద్ద పనికి చదికిలబడేటప్పటికి బల్లక్రింద రెండు మూటలు కంటబడ్డాయి. ఒకటి పాతగుడ్డల మూట. రెండోదాంట్లో చిరుగు దుప్పట్లూ, ఒక శేరు బియ్యమూ వున్నాయి. అది చూసేటప్పటికి ఆతడు చాలా వ్యధపడ్డాడు.

జోడు అల్లిక ప్రారంభించబోతూంటే ముంగిట్లో అడుగుల చప్పుడు వినబడింది. ఒక్క ఉదుకులో లేచి, ఆమూటలు రెండూ తీసుకుని చంకన బెట్టేడు. పారిపోవడానికై ప్రక్కగదిలో పడుకున్న తన ముసిలి భార్యను లేపడానికి పరుగెత్తుతోంటే గుమ్మంవద్ద పరిచితమైన గొంతుకే వినబడింది.

"లా ఓ-ల్యూ! అన్నా! తలుపు తియ్యి, నీతో మాట్లాడాలి."

పొరుగునవున్న చిన్నమామ గొంతుక అది. చంక మూటలతోనే ల్యూ వెళ్ళి తలుపు తీసేడు.

చంకన వ్రేలాడుతూన్న ఆమూటలు చూసి, చుట్టం పకపక నవ్వేడు.

"గట్టి ధైర్యవంతుడివే. ఈపాటికి మూటలు మూల పడెయ్యి. ఈ రాత్రికి జపానువాళ్ళురారు. నేను చెప్తున్నావిను."

మళ్ళీ ఒకనిముషం ఆగి, కంగారుగా అటూయిటూ చూస్తూన్న లాఓ-ల్యూ వంక చూసి మళ్ళీ నవ్వేడు.

"ఒకవేళ జపానువాళ్ళు వొస్తారే అను. అప్పుడు మాత్రం ఎక్కడికి వెడతావు ? ఎంతమంచు కురుస్తూందో చూడు. నువ్వు ఓర్చుకోగలిగినా నీభార్య మాటేమిటి ? నీతోపాటు ఈమంచులో ఆవిడ కొండలు ఎక్కి దిగి నడవగలదంటావా ?"

బ్యాకి తెలియకుండానే ఆతని చంకనున్న మూటలు క్రిందకు జారిపోయినాయి. "నడవలేదు. నిజమే. కాని, చేయగలది ఏముందింక? ఆదెబ్బనుండి ఇంకా తేరుకోనేనాలేదు. జపానుసైనికుడు ఆవిడకంట పడ్డాడంటే చాలు ఒళ్ళువిరుచుకు పడిపోయి తప్పకుండా చచ్చిపోతుంది."

చిన్నమామ ఆశ్చర్యంతో గుడ్లింతంతచేసి—"అబ్బ! అంతల్లా వుందన్నమాట."—అన్నాడు.

"ఆరోజునే ఒక జపానుసైనికుడు నా వీపు చిట్లగొట్టేడు. వాడెవడో బాక్సింగు నేర్చినవాడై వుంటాడు. ఎంతెంతగుద్దులు గుద్దేడనుకున్నావు ? ముసురు పట్టిననాడు ఇప్పటికీ నా ఎముకలు వచ్చిపుళ్ళలా కనిపిస్తాయి. కాని, నా మనస్సుకిమాత్రం అంత అదురు కలగలేదు ; జపానువాళ్ళు ఇంట్లో ఒక్కగింజ లేకుండా తుడుచుకుపోయినందుకు చాలా బాధపడ్డాననుకో. ఎంతో కష్టపడి, చెమటోడ్చి పండించుకున్న పంట ! అది లేకపోతే శీతాకాలంఅంతా కడుపులో కాళ్ళుపెట్టుకొని పడుకోవలసిందే. కాని వాళ్ళు మనని ఓడించారనేది మరిచిపోకూడదు. మనకున్న లొడ్డూ-లొసుగు దోచుకుపోవడానికి కాకపోతే, మనదేశంమీదికి ఎందుకు వచ్చేరంటావు ? సముద్రాలు దాటి ఇంతదూరం వూరికే వచ్చేరా ? ఈవిధంగా ఆలోచించుకొని మనస్సు తృప్తిపరచుకొని, నా విచారం తేలికచేసుకుంటూంటాను. మనవాళ్ళు కొంచెం ఖారీతనం చూపించాలి. జపానువాళ్ళను గురించి నీభార్య అంతభయపడ్డంవల్ల లాభం ఏమాత్రం లేదు. ఇంక మనవద్ద పట్టుకుపోయేదిమాత్రం ఏం వుంది ? వాళ్ళు సుఖంగావుంటే ఇవన్నీ ఎప్పుడేనా సంపాదించుకో

వచ్చు. 'పర్వతాలు పచ్చగావున్నంతవరకు పొయిలోకి ఇబ్బంది పడ
నక్కర్లేద'ని మన ముసిలాళ్ళు అనేవాళ్లు. జ్ఞాపకంలేదూ? ఏమంటావు?
హ్హా! హ్హా! హ్హా!...."

ముసలమ్మలాగ మెట్టవేదాంతం బోధిస్తూన్న స్నేహితుడి వాగ్ధో
రణి లాట్-ల్యూకు విసుగుపుట్టించింది.

"మామా! నీకు మా కష్టాలు అర్థంకాలేదు. ధాన్యం పోయినా
యని ఆవిడ అంత బాధపడడంలేదు. మన అదృష్టం కాలిపోయే నిరుడు
పంటకూడా అంతబాగానూ పండింది. బహుశా అందుకే వచ్చివుంటారు
జపానువాళ్ళుకూడా. లేకుంటే ఈ మారుమూలకి ఎందుకొస్తారు? పంట
బాగుందని తెగ చంకలుకొట్టుకున్నామేమో. హఠాత్తుగా వాళ్ళువచ్చి
దోచుకుపోయేటప్పటికి చాలాబాధపడ్డాం. అదోవిధంగా మన మనస్సుల్ని
బాధపెట్టింది. పండినదాంట్లో సగం జమీందారు పట్టుకుపోయాడు.
మిగతాది జపానువాళ్ళు దోచుకుపోయేరు. నాకు ఒక్కపూట తిండిక్కూడా
మిగల్చలేదు. నీకు?"

"ఏమీలేదు. నువ్వు ఒకపూట తిండికి అంటున్నావు ఒక్కగింజ
కూడా దాచలేక పోయాను. సిద్ధాంతి లూమింగ్ ఐనా ఇల్లా దాడివస్తుం
దని చెప్పలేక పోయేడు. అల్లాచెబితే సర్దుకునేనా వుండేవాడిని. ఎప్పుడో
నడివీధిలో నిలబెట్టి కడిగెయ్యాలనుకుంటున్నా. ఎందుకూ పనికిరాని
వాజెమ్మ అయిపోయాడు."

"ఇది వాడొక్కడి తప్పేకాదు. ఇదివరకు ఏంచెప్పినా సరిపడేది
కాదూ? సంవత్సరాదినాడు పెద్దలకి కాగితం వెలిగించినప్పుడు చూసేను.
ఒకమారన్నా మంట అటుయిటు కదిలిందా? మంట అంతసేపూ కాగి
తాన్నే పట్టుకు పాకింది. ఒక్కక్షణంలో అదంతా నుసయి వూరుకుంది.
మనపెద్దల పుణ్యమాయని ఈ ఏడాది సుఖంగా వెడుతుందనుకున్నా.
కాని ఏమయింది ఇప్పుడు? మన అదృష్టం అల్లావుంటే ఎవరేం చేయ

గలరు? భగవంతుడు రాసిన రాత ఎవరు తప్పించగలరు? చూడు. మొదట నా కొడుకు జపానువాళ్ళ చేతులకి చిక్కకుండా తప్పించుకు పోయేడు. కాని, ఒక్క అరగంట తర్వాత తిరిగివచ్చి, సరిగ్గా వాళ్ళ చేతుల్లో చిక్కేడు. ప్రారబ్ధం కాక మరేమి టంటావు? ఆరోజున ఏం జరిగిందో చూసేవుకదు?"

చిన్నమామ తలవూపేడు. తనకళ్ళముందు జరిగిన ఆ దృశ్యా లన్నీ కళ్ళకు కట్టినట్లున్నాయి.

* * * *

జిల్లాకేంద్రాన్ని పట్టుకొని జపాను సేనాశిబిరం స్థాపించినాక అక్కడినుంచి ఒకరోజు అర్ధరాత్రివేళ కొంతమంది ఈవూరు వచ్చేరు. ఊళ్ళో అంతా గాఢనిద్రలో వుండగా వీరు వచ్చినా రైతులబిడ్డలు కొంత మంది తప్పించుకు పోగలిగేరు. వారిలో లాఓ-ల్యూ కొడుకు హూఫా ఒకడు. జపానువాళ్ళ సడి తగిలినంతనే అతడు దొడ్డిదారిని పర్వతాలలోకి పారిపోయేడు. అనుకున్నట్లుగా గాకుండా జపానువాళ్ళు సౌమ్యంగానే వ్యవహరించేరు. వాళ్ళ అరుపులకు లాఓ-ల్యూ భార్యవంటి ముస లమ్మలు కొందరు హడిలి మంచం పట్టినా మొత్తం మీద వాళ్ళు ఎవరినీ చంపలేదు. వాళ్ళకి ధాన్యంతప్ప మరేమీ అక్కరలే దనిపించింది. అప్పటికింకా రైతులు కళ్లాలనుంచి ధాన్యం జేరవేసుకోలేదు. బెదిరింపుల తోటీ, ఒకటిరెండు దెబ్బలతోటీ రైతుల్ని అదరకొట్టి, వారిచేతనే గ్రామంలో ధాన్యం ఎక్కడెక్కడున్నదీ ఆచూకీ తీసేరు. కొత్తపంటే గాకుండా, పాతధాన్యం కూడా ఎక్కడన్నా అగతగిలితే లాగేసేరు. తెల్లవారేలోపున పని అంతా ముగించివేసుకున్నారు.

కాని వాళ్ళు వెంటనే వెళ్ళిపోలేదు. సూర్యోదయం కాగానే కోళ్లూ, కోడిపిల్లలూ ఎండలో అటూయిటూ తిరగాడడంచూస్తే వాళ్ళ

కళ్ళు కుట్టేయి. వెంటనే వరసబెట్టి ఊళ్ళోవున్న కోళ్ళనన్నింటినీ వెతికి ఏరడం ప్రారంభించేరు. మోటుదనంతప్ప ఊహ, ఉపాయం లేకపో వడంవలన వాటిని తరిమి తుపాకులతో కాల్చసాగేరు. అవి బెదిరి చెట్ల కొమ్మలు, ఇంటికొప్పులు, గడ్డివాములు ఎక్కి కూర్చున్నాయి. కొన్ని విపరీతమైన భయంతో చెవులు గింగురులెత్తేలాగ అరవసాగేయి. మానభంగ భయంతో ఒకగడ్డివామిలో దాగుకొన్న మేరోజ్ అనే కన్యకు ఈ కోళ్ల అరుపులు చాలా బాధకలిగించేయి.

మేరోజ్ వయస్సువచ్చిన అనాధయువతి. తండ్రి చెప్పులు కుట్టు కొని బ్రతికేవాడు. జూదంలో ఒక కసాయివానికి పడిన బాకీతప్ప అతనినుంచి కూతురుకు ఏవిధమైన ఆస్తీ సంక్రమించలేదు. తండ్రి యిచ్చిపోయిన ఆ అప్పును మేరోజ్ తీర్చడానికి వొప్పుకోలేదు. జమీం దారు హూ-ఆ దయదలచి ఆమెను దాసీగా ఇంట్లోపనికి పెట్టుకొ న్నాడు. పెద్దవాళ్ళు చేసినంతపని ఆమె చేయలేదుగనక భోజనం రేషన్ ప్రకారం కొద్దిగా ఇచ్చేవారు. ఆమె వయస్సుతోపాటు పని పెరిగినా రేషన్‌మాత్రం పెరగలేదు. చివరకు ప్రాణం విసిగి కోళ్ళు పెంచుకొని స్వతంత్రంగా జీవించ నిర్ణయించుకొంది. కోడిగుడ్లు అమ్ముకోవడంవలన ఆమె ఆర్ధికంగా స్వతంత్రురాలయింది. కాని ఆ గుడ్లు హూ-ఆకు తప్ప బయట అమ్ముకోడానికి వీలులేదు. తల్లి బిడ్డలసంబంధం ఆమె ఎరక్క పోయినా కోళ్ళనీ, కోడిపిల్లల్నీ ఆమె స్వంతపిల్లల్ని చూసుకున్నట్లు చూసుకొంటూంది. తనబిడ్డలు అల్లా గొడవచేస్తూంటే ఆమె సహించ లేకపోయింది. ఒక పెద్ద కోడిపెట్టను ఒకసైనికుడు పట్టుకోవడంచూసి ఇంక దాగివుండలేకపోయింది. "ఆ పెట్ట నాది. నీకు హక్కులేదు." అంటూ దాగుకున్న చోటునుంచి వచ్చి వాడితో హక్కులచర్చలోకి దిగింది.

"ఓసి నాముద్దూ!" అంటూ జపానువాడు మహానందంతో పెట్టను వదిలిపెట్టి, మేరోజ్‌ను కాగలించుకున్నాడు. "నీలాంటి ముద్దులొలికే పిట్టకోసమే వెతుకుతున్నానే" అంటూ ఒకచేత్తో ఆమె నడుము, రెండో చేత్తో ఆమె తొడలు పట్టుకొని ఎత్తి, ఆ ఎర్రని పెదవులపై ముద్దులు పెట్టుకోసాగేడు. టూత్ బ్రష్‌లావున్న ఆతని దుబ్బుమీసాలు ఆమె ముఖంనిండా గుచ్చుకొన్నాయి. తేనెలోపడ్డ చీమలా ఆమె అటూయిటూ గుంజుకొని బయటపడడానికి ప్రయత్నించింది గాని సాధ్యంకాలేదు. అక్కడినుండి దిక్కులు ప్రతిధ్వనించేలాగ ఏడ్పులు, పెడబొబ్బలు ప్రారంభించింది. కంచుగంట మ్రోతలా ఆమె గొంతుక పర్వతప్రదేశాలన్నిటా మారుమ్రోగింది.

దగ్గరలోనే ఒకగుట్టమీద హౌఫా దాగి వున్నాడు ఈ ఆర్తధ్వని ఆతని చెవుల బడింది అది మేరోజ్ గొంతుక అని గుర్తించేడు. ఆమె మీద ఆతనికి ప్రత్యేకమైన ప్రేమ లేకపోయినా, తీక్షములయిన ఆమె నల్లని కళ్ళు ఆతనిని అప్పుడూ అప్పుడూ ఆకర్షింపకపోలేదు. ఆమెను బాధిస్తూన్నారని తెలిసి సహించలేక పోయేడు. ఒక్క విసురువ ఊళ్ళోకి వచ్చిపడ్డాడు. జపానువాళ్ళు ఆమెమీద చేస్తూన్న అత్యాచారాన్ని చూసి సహించలేక మేరోజ్‌మీదవున్న జపాన్‌వాడి తలమీద పిడి కిలి బిగించి ఒక్కగుద్దు గుద్దేడు. కాని, మేరోజ్‌ను విడిపించనే లేక పోయేడు. మరో జపానువాడు వచ్చి, ఆతనిచేతులు రెండూ గట్టిగా పట్టుకున్నాడు. మరొకడు వచ్చి పెద్దతాడుతో అతనిచేతులు రెండూ కట్టేసేడు. వాళ్ళిద్దరూ ఆతడిని ఈడ్చుకుపోయి దూడలసాల ప్రక్కనున్న ఒక చెట్టుకొమ్మమీదుగా ఆ తాడు రానిచ్చి చివర పట్టుకు లాగేరు. హౌఫా చెట్టుకొమ్మనుండి కోదండం తీసినట్లు వ్రేళ్ళాడుతున్నాడు.

వేళ్ళాడుతూన్న హౌఫాను జపానువాళ్ళు తిట్టడం ప్రారంభించేరు.

"లంజకొడక ! నీపని పడతాం వుండు."

ఆతిట్లు విని హౌఫా తల్లి కిటికీలోంచి తొంగి చూసింది. త్రిశంకుడు మాదిరిగా గాలిలో వూగుతూన్న కొడుకు అవస్థ చూసేటప్పటికి ఆమెకు భయమూ, సిగ్గూకూడా పోయినాయి. పరుగెత్తుకు వెళ్ళి జపాను వాళ్ల కాళ్ల మీద పడింది. క్షమించండని కళ్ల నీళ్లుపెట్టుకొని ప్రార్థించింది. హౌఫా కళ్ళు మూతలు పడిపోయినాక వాళ్లిద్దరూ అతడిని క్రిందికి దింపేరు. ముఖం మీద నీళ్లుకొట్టీ, ముక్కులో పొడుం పెట్టీ చాల సేపటికి ఆతనికి తెలివి తెప్పించేరు. ఆతల్లి మాత్రం భయంతో మూర్ఛపోయింది. ఆటు తర్వాత ఎన్నాళ్లికోగాని ఆమె మంచం దిగనేలేదు.

జపానువాళ్లు ఆపట్టణం నుంచి వెళ్ళిపోయేటప్పుడు మేరోజునీ, హౌఫానీకూడా తీసుకు పోయేరు. సెలవు పుచ్చుకుంటూన్నట్లు గ్రామస్థులతో "వాళ్ళచేత పని చేయిస్తాం. లేకపోతే చెడిపోతారు. మీకు కూడా ఇది జ్ఞాపకం వుంటుంది." అని హేళనగా చెప్పి మరీపోయేరు.

* * * *

"నీ కొడుకును లాక్కుపోయేరనేనా నీభార్య మంచం ఎక్కుత? ధాన్యం ఎత్తుకుపోయేరనికాదూ?"

అన్నాడు చిన్నమామ. ధాన్యం, కోళ్ళు ఎత్తుకుపోతే మనిషికి వచ్చేరోగాల్ని గురించే ఆతని ఆలోచనఅంతా సాగుతూంది.

తాను అల్లుతూన్న చెప్పులో మరో జమ్ముపరక దూరుస్తూ ల్యూ "మరెందుకనుకున్నావు?" అన్నాడు.

"అయితే మరి ఇబ్బందేలేదు." అన్నాడు పెద్దవేదాంతిలా బహు తాపీగా, పెదవులు తడుపుకుంటూ.

"నీకొడుకు తిరిగి వస్తున్నాడు. ఆ లంజా వస్తూంది."

లాఓ-ల్యూ ఆతురతతో తాను అల్లుతూన్న జోడు దూరంగా పెట్టేసేడు. మాటలు శ్రద్ధగా వినడానికి పొరుగు పెద్దమనిషికి దగ్గరగా జరిగి "నిజంగానేనా? నీకెల్లాతెలుసును?" అనడిగేడు.

ల్యూ ఆతురత చూసి చిన్నమామ చెప్పడం ప్రారంభించేడు.

"ఆ వార్త చెప్పడంకోసమే వచ్చేను. నిన్ను చూడగానే, ఖర్మం, ఆసంగతే మరిచిపోయేను. జపానువాళ్ళువచ్చేక వెనకటిమాదిరిగా సాయంకాలంపూట కూర్చుని మనం కబుర్లుచెప్పుకోడమే పడడం లేదు! ఇరుగుపొరుగున కాపురంవున్నా మొహంఎరగనివాళ్ళల్లా బతుకుతున్నాం. వచ్చినపని మరిచిపోయేనుచూడు! నా తెలివి తగలబడ!"

చిన్నమామ నెమ్మదిగానే తన బట్టతలని తట్టుకుంటూ "మట్టిబుర్ర అయిపోయింది. ఇల్లాంటి వార్తలు మరచిపోనా? వచ్చేసింది. ముసిలితనం వచ్చేసింది. కాలం గడిచిపోయింది. స్స! స్స!" అనుకున్నాడు.

లాఓ-ల్యూ ఈ ఆత్మగతాన్ని ఎంతో సేపు భరించలేకపోయేడు.

"అసలు సంగతేమిటో చెప్పవయ్యా! ముసిలాడి వయిపోయావని నేనెరగనా, లోకం ఎరగదా? అసలు విషయం ఏమిటి?"

వయసు వచ్చినకొద్దీ తన జ్ఞాపకశక్తి కోల్పోతూందేయని ఆలోచిస్తూన్న చిన్నమామ ముఖం వంక చూస్తూ ల్యూ చాలాసేపు కూర్చున్నాడు.

"అల్లాగే!" అన్నాడు ఆతడు.

కాని, అంతలో తాను చెప్పదలచుకొన్నది కాస్తా మరిచిపోయినట్లుగా, వేళ్ళు దులుపుకుంటూ, బట్టతల బరుక్కోనడం ప్రారంభించేడు. ఒక్కక్షణం పోయేక హఠాత్తుగా బల్లమీదగుద్ది "ఆఁ. ఆఁ. జ్ఞాపకం వచ్చింది. ఆదొంగవెధవ హాంగ్‌మీఁ జ్ఞాపకం వున్నాడా?" అని అడిగేడు.

మరుక్షణంలో ఏదో రహస్యం చెప్పబోతూన్నట్లు దగ్గరగా జరిగి, స్వరం తగ్గించేడు.

"భోజనాల వేళకి ముందు వాడు ఊళ్లోకి వచ్చేడు. ఊరు వదలిపోయిన మూడు నెలల్లోనూ ఎంత మారిపోయేడనుకున్నావు? ఇదివర

కటి కంటె పెంకితనం. పొగరుబోతుతనం బలిసింది. జపానువాళ్ళు ఇంక మనవేపురారు అన్నాడు. వాళ్లు చీనాను జయించేసేరట. ఇంక శాంతి-భద్రతలు కావాలట. అవి స్థాపించడానికి రేపు జమీందారు హూఅ వస్తున్నాడట వాళ్ల సదుద్దేశం తెలపడానికి హౌఫా, మేరోజుల్నికూడా ఆయనతోపాటు పంపేస్తున్నారట. ఇంక ఫర్వాలేదు. ఆలస్యం కాకుండా పారిపోడానికి వీలుగా వుండాలని కట్టుకున్నమూటలు విప్పెయ్య వచ్చును."

ఈ మతిమరుపువాని మాటలను ల్యూ వెంటనే నమ్మలేకపోయేడు.

"నీకెవరు చెప్పేరిది ?"

"నాస్వంతకళ్లతో చూస్తేనే ! ఔనుగాని, యుద్ధం జరుగుతూనే వుందా, వాడెంతలావు ఊరేదనుకున్నావు? చిత్రంగాలేదు? నేనుకూడా అల్లా అయితే బాగుండు ననుకున్నా."

లాఓ-ల్యూ సమాధానం చెప్పలేదు. యుద్ధం వున్నా, లేకపోయినా లావు పారడంలో ఆతనికంత ఆసక్తిలేదు. ఆతడు ఆలోచిస్తూన్న దొక్కటే. జమీందారు హూఅ ఊళ్లో స్థాపించే శాంతి ఏ మాదిరిది ? వాడు వట్టి సోమరి. ఆశకి అంతులేదు. అందర్నీ ఏడిపించి తాను సుఖ పడాలంటాడు. జపానువాళ్లు కొద్దిరోజులకు వస్తారనగా తన సముద్దారు హాంగ్‌మీను వెంటబెట్టుకు పట్టణం పారిపోయేడు. పల్లెటూళ్లో గంద్ర గోళాలు వస్తాయని భయపడ్డాడు. మళ్లీ ఎందుకు వస్తూన్నట్లు? బహుశా ఎక్కువ శిస్తులు పిండడానికి సముద్దారు ఒక్కడేనేమో వస్తూంట? లాఓ-ల్యూ హాంగ్‌మీని ఎన్నడూ మరచిపోలేదు. హూఆకి కౌలుదారు కావడం చేత ల్యూకు హాంగ్-మీతో బాగా పరిచయం వుంది, పంట యింకా యింటికి చేరేలోపుగనే, ఈతడు వచ్చి పీకమీద కూర్చునే వాడు. "నాకనేక పనులు. నీకోసం నిత్యం తిరుగుతూ కూర్చోలేను" అని శిస్తుకోసం తొందరలు విడిపించేవాడు. ధాన్యం నూర్చుకుంటూంటే,

అందరి మొహాలూ చూస్తూ ధరణా-కూర్చునేవాడు. తనపని అయ్యే వరకూ కదిలేవాడు కాదు. రోజు కూర్చోనీ, రెండు రోజులు కూర్చోనీ ఇంట్లో వున్నదాంట్లో మంచి ఆహారం ఇచ్చి మనుగుడుపు పెళ్లికొడుకును మేపినట్లు మేపాలి.

"జపానువాళ్లకి అంతకంటె మరొక డెవ్వరూ దొరకలేదా ఆ పనికి ?" అని ల్యూ భయంతో ప్రశ్నించేడు.

"ఎవళ్లు ! జపానువాళ్లా !" అని లోపలినుండి ఒక స్త్రీ గొంతుక వొణుకుతూ వినబడింది. "దేవుడోయ్ !" అనేకేకతో ధమ్మున క్రింద బడిన చప్పుడయింది.

ల్యూ విపరీతమైన ఆతురతతో లేచేడు. "మా ఆవిడకు ఏదో కల వచ్చింది. పోయి వస్తా."

ఆతడు తనభార్య పడుక్కున్న లోపలి గదిలోకి పరుగెత్తేడు. చూసేటంతకి ఆమె క్రిందపడి కాళ్లు చేతులు కొట్టుకుంటూంది. ఆతడు ఆమెను లేవదీసి మంచంమీద పడుకోబెట్టేడు. "కంగారుపడకు. జపానువాళ్లు రావడం లేదుల్తే. మనం ఇంక ఎక్కడికీ పారిపోతూండ నక్కర్లేదు. ఇంక వాళ్లు మనజోలికి రారని ఇప్పుడే చిన్నమామ చెప్తున్నాడు. ఇంక ఫర్వాలేదుట."

ఆటుతర్వాత ఆమె శాంతంగా పడుక్కుంది. లాఓ-ల్యూ ఇంత ముఖంచేసుకుని సావిడిలోనికి వచ్చేడు.

"క్షమించు, మామా ! అర్థరాత్రివేళ ఇల్లా పెడబొబ్బలు పెడుతుంది. ఏం చెయ్యను చెప్పు ? నా కొడుకుని వేళ్ళాడదీయడం చూసి నప్పటినుంచీ ఇంతే. జపానువాడి మాట వినబడితే చాలు ఇల్లా అవుతుంది. ఏం చేస్తాం ? అనుభవించాలి. ఏదో పిశాచం దానిని పీక్కు తింటూంది. పూర్వజన్మలో ఏదో మహాపాపం చేసివుంటాము. దాని

ఫలితం ఈ ముసిలితనంలో అనుభవిస్తున్నాం." అంటూ ల్యూ తల వంచుకొని కళ్ళనీరు పెట్టుకొన్నాడు.

"సిద్ధాంతి లూమింగ్ ఏమన్నా చెప్పగలడేమో చూసేవా ?" అని చిన్నమామ సానుభూతితో సలహా యిచ్చేడు. "వాడికి దేవతలు, దయ్యాలూ పిలుస్తే "ఓయ్" అంటారు మంచి మంత్రగాడు. ఇన్ని ధాన్యం ఇస్తే చాలు, మీఆవిడను పట్టుకున్న దయ్యాని ఇట్టే వెళ్లగొడ తాడు. పాపం. ఈ ఏడాది తిండిలేక మాడిపోతున్నాడు."

ల్యూ ఏమీ సమాధానం ఇవ్వలేదు. చిన్నమామ ధోరణి ఆతనికి ఏమీ నచ్చలేదు. అంత వేదాంతం బోధించే పెద్దమనిషి, ఆవిధంగా ప్రతిదానికీ బియ్యం, ధాన్యంతో విలువ కడుతూండడం అసహ్యం వేసింది. మన జీవితానికి ధాన్యం చాలా అవసరమైన వస్తువేనని ల్యూ ఎరుగును. కాని, పిశాచాలబాధ పొదుల్చుకొనేందుకు ధాన్యం అవసర మైన వస్తువు కాదని ఆతని అభిప్రాయం. పైగా జపానువాళ్లు వచ్చి వెళ్లేక, ఇక ఇంట్లో ఒక్కగింజన్నా మిగులుతేనా ?

చాలాసేపు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. చిన్నమామకు ఆవలింతలు ప్రారంభమైనాయి. నిద్ర ఆపుకొనేటందుకు ఎన్నో పర్యా యాలు కళ్లు నులుముకొన్నాడు. లాభం లేకపోయింది. కూర్చోవడం అశక్యం అయిపోయింది. ఇంక లేచి సెలవు పుచ్చుకొన్నాడు. లాఓ-ల్యూ ఆతడిని సాగనంపి తలుపులు వేసేసుకొన్నాడు.

## ౨

మరునాడు మధ్యాహ్నం మంచు కురవడం నిలిచిపోయిన కొద్ది నిముషాలకే జేగంట మోతతో వూరంతా ప్రతిధ్వనించింది. ఆమోత ఊళ్ళో ఏదో అంటుకున్నంత అలజడి కలిగించింది. అనుక్షణమూ జపానువాళ్ళు వొస్తారేమోనన్న భయంతో రోజులతరబడి ధారాపాతంగా కురుస్తూన్న మంచువర్షం వలన నిశ్శబ్దంగా వున్నగ్రామం ఒక్కమారు మేల్కొంది. మనస్సులో ఆరాటం వున్నా పైకి శాంతంగానే కనబడు తూన్న ఊర్వాసులు కిటికీ తలుపులు తెరచి వీధిలోకి తొంగి చూసేరు. బయట ఏమీ గొడవ లేదు. ఆ-క్యూ వీధివెంట జేగంట మ్రోగించుకుంటూ ప్రతి ఇంటికీ వెళ్ళి పిలుస్తున్నాడు.

"దేవుడుగుళ్ళోకి రండి. జమీందారు హూఆ గారు ఏదో చెప్తా రుట. దేవుడు గుళ్ళోకిరండి."

ఆక్యూ హూఆ యొక్క గుర్రాలవద్ద వుండేవాడు. పొలాలమీది తనిఖీకి వెళ్ళినప్పుడూ, పట్టణంలోకి ఏదన్నా పనిమీద వెళ్ళినప్పుడూ. జమీందారు ఎక్కే దోరవన్నె గుర్రాన్ని కనిపెట్టి చూడడం అతడిపని. ఆతడు కర్తీలేని పదహారిణాల మూర్ఖుడు. జూదం అంటే ఇంక తిండి కూడా అక్కర్లేదు. సంవత్సరాది రోజున రైతులు సరదాకి పేకాటో, పాచికల ఆటో ఆడుకుంటూంటే ఆక్యూ అందులో విధిగా ప్రవేశిస్తాడు. ఆఏడాది అంతా కష్టపడి కూడపెట్టిన డబ్బును, కట్టుబట్టలతోసహా ఆటలో ఓడిపోయేదాకా జూదం ఆడతాడు. ఆయాసం వొచ్చి, దిగాలు పడి ఒకటిరెండు రోజులు గుర్రాన్ని సరిగ్గా చూడడు. అప్పుడు "అతన్ని దారిలో పెట్టేటందుకు" అంటూ జమీందారు కమిచీ తీసుకుని ఒక అర డజను వుతుకుతాడు. దానితో మళ్ళీ దారిలోపడి మామూలుగా పని ప్రారంభిస్తాడు. ఆక్యూ యొక్క ఈపాడు అలవాటు యజమానికి ఎంతో

ఉపయోగించింది. స్వతంత్రంగా జీవించడానికి తగినడబ్బు ఆతనివద్ద వుండదు. అందుచేత హుఆ ఏషరతులు విధిస్తే వానికే ఒప్పుకొని, ఆతనివద్ద పనిచేయాలి. ఈ అవకాశం తీసుకొని హుఆ ఏడాదికి రెండు మార్లు జీతం తెగ్గోస్తూంటాడు. ఆక్యూ ఏడ్చినా తప్పదు. మొత్తుకున్నా తప్పదు. ఆతనికి మరోగతిలేదు. హుఆ కు కావలసింది అల్లాంటివాడే. చవగ్గా పనిగడవాలి ఆతనికి. ఆవిధంగా ఆక్యూని ఎప్పుడూ "నిరుద్యోగ సమస్య" ఎదుర్కొనేలేదు. అంతకన్నా అధ్వాన్నస్థితిలోవున్న ఆగ్రామ స్థులు అది చూసే మురిసిపోయేవారు. కాని జపానువాళ్ళు వచ్చి, తాము ప్రారంభించిన "పవిత్రయుద్ధం" కోసం దోరవన్నె గుర్రాన్ని కాజేసాక, ఆతనికి ఆవుద్యోగం కాస్తా వూడింది. అప్పటినుంచీ మాడిపోతూన్నాడు. అల్లాంటిది ఇప్పుడు ఒక్క క్షణం క్రితమే స్వేష్టకృతుగా భోజనంచేసిన వాడిలా ఆతడు మహాహుషారుగా వున్నాడు. ఆతని మాటలు పాటలా వినబడుతున్నాయి.—"జమీందారుగారు ఏదో ముఖ్యమైన సంగతి మాట్లాడుతారు. అంతా దేవుడిగుళ్ళోకి రండో హోయ్!" అంటున్నాడు.

ఎముకలు బయటపడి, కంకాళంలా కనబడుతూన్న ఆక్యూ కోతిలా ఎగిరి గంతేసి టముకు కొడుతూంటే కిటికీలోంచి ల్యూ చూసేడు. "జమీందారు హుఆ నిజంగానే వచ్చినట్టుంది." అనుకున్నాడు. నిన్నరాత్రి చిన్నమామ చెప్పిపోయిన మాటలు నిజమే ననుకున్నాడు. జపానువాళ్ళకీ, జమీందారు హుఆకీ ఏంమాటలు జరిగాయోయని ఆలో చనలో పడ్డాడు. పూర్వం రోజుల్లో యుద్ధవీరులు, సేనాధిపతులూ పన్నులు వసూలు చేసుకోడం పేరుచెప్పి, ధాన్యం వసూళ్ళ పేరుచెప్పి వచ్చినపుడు హుఆ వాళ్ళతో ఇట్టే కత్తుకలిపేసేవాడు. ఇప్పుడు కూడా బహుశా జపానువాళ్ళతో ఏదోవిధంగా ఏర్పాటుచేసే వుంటాడని ల్యూ ఆలోచించసాగేడు. ఈ ఏర్పాట్లు జపానువాళ్ళకు 'సుఖం' కలిగించేటట్లే

వుంటాయని ఆతడెరుగును. కాని, ఏదోవిధంగా వాళ్ళు ఊరిమీద పడ కుండా చేసుకుంటే....

మధ్యాహ్నపుభోజనానికి ఆతని భార్య వంటపాకలో గంజి కాస్తూంది. లాఓ-ల్యూ ఆమెతో చెప్పడానికి వెళ్లేడు. ఆమె పొయ్యి ముందు ముక్కాలిపీటమీద కూర్చుండి, అరచేతిలో గడ్డం ఆనించుకొని, పరధ్యానంగా పొయ్యిమీదవున్న కుండవేపే చూస్తూంది. కుండనిండా నీళ్లి కళపెళ్లాతు తున్నాయి. అన్ని నీళ్లలోనూ వేళ్లమీద లెక్కపెట్ట గలిగేటన్ని బియ్యపుగింజలు పల్టీలు కొడుతున్నాయి. ల్యూ ఆమె ప్రక్క నిలబడి రెండు చేతులతో ఆమె గడ్డం పట్టుకొని, ఎత్తి ఆమె కళ్లల్లోకి పొంగి చూసేడు. సగం సంతోషం, సగం కన్నీళ్లతో—"హూఅ వచ్చేడు"—అన్నాడు.

"అంటే మళ్లీ ఆతడి పొలం దున్నుకోనిస్తాడన్నమాట. దేవుడి గుడివద్ద ఏమిటోగాని చెప్తాడట. నువ్వుకూడా వస్తావా? నేను వెడు తున్నాను."

ఆమె ఒక్కమాటకూడా పలకకుండా శూన్యదృక్కులతో ఆతని వేపు చాలాసేపు చూస్తూ కూర్చుంది. తర్వాత మాట్లాడకుండానే లేచి నిల్చుంది. ఆతని భుజంమీద ఆనుకుని అడుగులు వేసింది. ఇద్దరూ దేవుడిగుడివేపు వెళ్లేరు.

వీరు వెళ్లేటప్పటికి గుడి ఆవరణ జనంతో నిండిపోయింది. కుర్ర వాళ్లూ, ఆడవాళ్లూ ఇంకా వస్తూనే వున్నారు. హూఅ తిరిగి రావడం గ్రామస్థుల్ని బాగా కదలించింది. ఆతని రాకపై అనేక విధాల వూహాలు, ఆశలు సాగుతున్నాయి. గుడి మండపం మధ్య ఒక టేబిలు వేసివుంది. దానిప్రక్కగా రెండు కుర్చీలు వేసేరు. వాని వెనకవేపున పొడుగుపాటి బెంచి వేసేరు. గోడమీద రెండు కాగితపు జెండాలు-ఒకటి చీనావారిదీ, వేరొకటి జపానువారిదీ క్రాస్‌గా అమర్చేరు. జెండాలనడుమ, పైన

జపాను చక్రవర్తి బొమ్మ తగిలించేరు. జెండాలకు రెండువేపులా రెండు పొడుగుపాటి కాగితపు చుట్టలు వ్రేలాడదీయబడ్డాయి. దానిమీద బర్రె గీతలతో రెండు మాటలు వ్రాయబడ్డాయి.

"ఆశియా జాతులన్నీ కలవాలి."

"చీనా - జపానులకు స్నేహం కలవాలి."

హూఅ అక్కడలేడు. జమీందారుగారి సముద్దారు హాంగ్‌మీం అక్కడే వేదికమీద వున్నాడు. కుడిమోచేతిని ఎదురుగా వున్న టేబిలు మీద మోపి, ఆతడొక కుర్చీలో కూర్చుండి వున్నాడు. ఆతనికి ఎదురుగా నేలమీద గ్రామస్థులంతా కూర్చున్నారు. నిజంగానె హాంగ్ మీ తెగబలిసి వున్నాడు. "తిండి దొరక్క ప్రజలు ఎండుతూంటే ఇతగాడు లావు జారేడు. చాల ఆశ్చర్యమేనే. నాకూ్కడా...." ఆశ్చర్యంతో, వింత చూస్తూన్నట్లు నోరు తెరుచుకొని ల్యూ జమీందారుగారి సముద్దారువంక చూడసాగేడు. ఆదృశ్యం ఆతనిలో భయాన్నేకలిగించింది. అసలే భయం కరమైన ముఖం. దానికితోడు బుగ్గలూ, కణతలూ వూరి కళ్ళు మూసుకు పోయి, మరింత భయం కలిగిస్తున్నాయి.

ఇంత లావుమనిషి స్వరం ఎంత భయంకరంగా తయారయిందో నని ల్యూ హాణికిపోయేడు. శిస్తు వసూళ్ళకివచ్చి, ఇంట్లో కూర్చుని గావు కేకలు పెడుతూంటే ఒళ్ళు చచ్చిపోయేది. ఇంతలో గుడివెనుక అడు గుల సడి వినబడింది. మరునిముషంలో తలుపు తెరుచుకొని, జమీం దారు హూఅ మరిముగ్గురితో లోపలికి వచ్చేడు. ఆముగ్గురిలో ఒకతె పేరోజ్, రెండోవాడు జపాను వాళ్ళు లాక్కుపోయిన లాఓ-ల్యూ కొడుకు హౌఫా. మూడోవాడు అక్కడివారందరికీ కొత్తే. పొట్టిగా, మీసాలూ వాడూ వున్నాడు. కొడుకు కనబడగానే ల్యూ తన ఆలోచనల నుంచి మేల్కొన్నాడు. ఆతని భార్య మాటపెగిలి రాకపోయినా గాని

కెవ్వుమంది. ఆవిడకు ఓపికేవుంటే ఒక్క వురుకులోపోయి కొడుకును కాగలించుకొని వుండేది. కాని, అటువంటివేమీ జరగక పూర్వమే హాంగ్‌మీ లేచి 'నిలబడండి!" అన్నాడు.

గ్రామస్థు లిదివరకెప్పుడూ ఇలాంటి గొడవ ఎరక్కపోవడంచేత వెర్రిమొగాలు వేసుకుని మాటామంతీ లేకుండా లేచి నిలబడ్డారు. హుఆ, మీసాలమనిషి నెమ్మదిగా వచ్చి బల్లమీద చదికిలబడ్డారు. హౌఫా, మేరోజులు వారికి చెరొకప్రక్క నిలబడ్డారు. ఆసమయంలో హాంగ్‌మీ ఒక్క గావుకేక పెట్టేడు. "జాతీయగీతం పాడండి." గట్టిచిక్కే వచ్చి పడింది. అసాధ్యమైన సమస్య తెచ్చిపెట్టేడు. ఆ వూళ్ళోవాళ్ళు చీనా వాళ్ళదిగానీ, మరొకళ్ళదిగానీ జాతీయగీతం ఎప్పుడూ విని వుండలేదు. హాంగ్‌మీ తానే పాడడం మొదలెట్టేడు. కాని, అందులో ఒక్కమాట కూడా ఎవ్వరికీ అర్థం కాలేదు. సముద్దారు ఆజ్ఞాపించేక పాడకతప్పు తుందా? కొంతమంది రైతులు ధైర్యంచేసి పల్లెటిగీతం ఒకటి పాడడం ప్రారంభించేరు. హాంగ్‌మీ బొంగురుగొంతుకా, ఈ జానపదగీతం పాడుతూన్న రైతుల స్వరాలు ఒకదాని కొకటి మేళవించి కప్పలు బెక బెకలాడుతూన్నట్లు తయారయింది. మీసాలమనిషి కనుబొమ్మలు ముడేసి విసుగుతో పొడిదగ్గు దగ్గడం ప్రారంభించేడు. పాడుతూ పాడుతూన్న వాడల్లా హాంగ్‌మీ "కూర్చోండి" అని కేకబెట్టేడు. మీసాలవాడి ముఖం చూసేటప్పటికి అతడి చొక్కాలో జెర్రిపాకినట్లయింది. గ్రామస్థులంతా మళ్ళీ చదికిల బడ్డారు. వాళ్ళకి ఈగొడవ ఏమీ అర్థం కావడం లేదు.

హుఆ లేచి, బహు గంభీరంగా వేదికమీద ముందుకు రెండడు గులు వేసేడు. పొడుపాటి గోధుమరంగు కోటు తొడిగిన హుఆ వెనకటి కన్నకొంచెం చిక్కినట్లు కనబడుతూన్నాడు. ఆతడు చేతికర్రలా ఉపయో గించే వెదురువేరు పొగగొట్టం (పైప్) ఆతని చేతిలోనేవుంది. జపాను వాళ్ళ ఫేషనులో కొత్తగా పెంచుతూన్న మీసం తప్ప అతనిలో కొత్త

మార్పేమీ కనబడలేదు. అతడి గంభీరమైన కళ్ళు తమ మీద ప్రసరించ గానే ఎదుట కూర్చున్న గ్రామప్రజ అందరికీ ఒళ్ళు జలదరించింది. అందరూ నిశ్శబ్దంగా ఏం వచ్చి పడుతుందో అన్నట్లు చూస్తున్నారు. హఠాత్తుగా పెద్ద గొంతుతో హూఅ ఉపన్యాసం ప్రారంభించేడు.

"సోదరులారా! గత కొద్దిమాసాలుగా మిమ్మల్నిగాని, నాభూము ల్నిగాని చూసుకోలేకపోయేను. పరిస్థితులు అల్లావచ్చేయి. మిమ్మల్ని విడిచివెళ్ళక తప్పిందికాదు. నామనస్సు ఎంతో బాధపడింది. కాని, ఏం చేస్తాను? కాని, నాభూమికోసం ఎంత పరితపించానో మీకోసం కూడా అంత దుఃఖపడ్డానంటే నమ్మండి. తర్వాత జరిగిన ఘటనలనుపట్టి చూస్తే నేను పట్టణంవెళ్ళి కాపురం పెట్టడం మంచిదే అయిం దనిపి స్తుంది. జపాన్ సామ్రాజ్య సైన్యాధిపతుల ధర్మమాయని నేను మరల మీసేవచేయగలిగే అదృష్టం పట్టింది...."

మాటమధ్యలో ఆగిపోయి తాను వారికి చేయబోయే సేవలను ఏకరువు పెట్టడానికి జ్ఞాపకం చేసుకోసాగేడు. బుర్ర తడుముకున్నా, కొత్తగా పెరుగుతూన్న మీసం గిల్లుకున్నా లాభం లేకపోయింది. చివ రకు పట్టణంలో వున్నపుడు జపాను వాళ్ళనుంచి నేర్చుకున్న కొన్ని పదాలు గుర్తుకొచ్చేయి. 'ఆశియా ఆశియావాసులకే,' 'ఆశియాలోని జాతు లన్నీ ఏకంకావాలి,' 'బోల్షివిజం మహామారినుంచి ప్రపంచ నాగరికతను రక్షించడానికై పవిత్రపోరాటం సాగించాలి' మొదలయిన పదజాలాన్నం తనీ దూర్చి, యూనివర్శిటీ ప్రొఫెసరులాగ ఎవడికీ అర్థంకాకుండా ఉప న్యాసం సాగించేడు.

గ్రామస్థులందరూ నోళ్ళు తెరుచుకొని, ఎంతో శ్రద్ధతో విన్నారు. అర్థం చేసుకుందుకు ఎంతో ప్రయత్నించేరు. కాని, ఒక్కరికీ హూఅ మాట్లాడుతూన్నది దేనివిగురించో అర్థంకాలేదు. ఈ కొత్తమాటలకీ తమ వ్యవసాయాలకీ దూడా- దుడిక్కీ, శిస్తు-పస్తులకీ ఏమీ సంబంధం లేదని

నిశ్చయించుకున్నారు. అందుచేత ఆ మాటలవలన వారికంత ఉత్సాహం కలగలేదు. ఉపన్యాసం జరిగినకొద్దీ విసుగుదల హెచ్చింది. ఎప్పుడు వొదిలిపోతుందా అనుకోసాగేరు. వారి దృష్టి గ్రామానికి తిరిగివచ్చిన జపాను ఖైదీలమీదకీ, మసాలవాడి మీదకీ తిరిగింది. వాడు హాల ప్రక్కన కూర్చుండి, కదల మెదలకుండా వింటున్నాడు. వాడి మనస్సులోని భావాలు ఏమిటో ఎవ్వరికీ అర్థంకాలేదు.

హౌఫా కొంచెం వయస్సు పెరిగినవాడల్లే వున్నాడేగాని అంత కంటె పెద్ద మార్పేమీలేదు. నుదుటిమీద రెండోమూడో పొడుగాటి మచ్చలు కనబడుతున్నాయి. ఆ చూపులకు తగినట్లుగా మనిషిలో గాంభీర్యం, శాంతం ఏర్పడింది. వెనకటి తొందరపాటూ ఆవేశం ఇప్పుడు కన బడ్డంలేదు. ఆతని ముఖం చూస్తే తనను ఇక్కడకు తీసుకురావటం వలన సంతోషపడుతున్నాడో లేదో కూడా తెలిసేలాలేదు. బహుశా తన తల్లిదండ్రులు కూడా వచ్చి జనంమధ్య కూర్చుని వున్నారనీ, తనకోసం తన తల్లి ఇంచుమించు మతి పోగొట్టుకొందనీ ఆతనికి తెలుసునో తెలి యదో. మేరోజ్ పూర్తిగా మారిపోయింది. ఇద్దరు, ముగ్గురు పిల్లల్ని కన్నదానిలా చిక్కి శల్యం అయిపోయింది. కాని, చర్మం ముడతలు పడిపోలేదు. ఆమె సన్నని శరీరంలో నల్లని కళ్ళు మరింత పెద్దవిగా, కనబడుతూన్నాయి. ఆమె ఆకళ్ళతో గ్రామస్థులవంక చురుకుచురుకుగా చూస్తూంటే చాలమంది యువకులు ముగ్ధులయిపోయేరు.

తమకి పరిచయంలేని ఆకొత్తవాడి సంగతి వాళ్ళకేమీ బోధపడ డంలేదు. మోటుగా, పొట్టికుంచంలా వున్నాడు. గుండ్ర పుచ్చకాయలా కనబడే చప్పుమొహం. చప్పిడిముక్కు. దానిక్రింద తమాషాగావున్న గుబురుమీసం. అది చూసేటప్పటికు వాళ్ళంతా నవ్వేటంత పర్యంతం అయింది. కాని వాడిమొహం, వాడి నిశ్శబ్దం చూసినమీదట చివరకు చిరు నవ్వు కూడా వాళ్ళపెదవులమీదికి రావడానికి వెరిచింది. పైగా వాడు పైన

వేసుకొన్న నల్లని పైగుడ్డ చూసేటప్పటకు వాళ్ళందరికీ యములాడు జ్ఞాపకం వచ్చేడు.

ఇంతసేపూ హుఆ "కొత్తఆశియా ప్రభుత్వవిధానాన్ని" గురించి చెప్పుకుపోతూన్నాడు. ఇంక తనకు వచ్చిన శబ్దజాలం అంతా పూర్తిగా వాట్టిపోయేక అతడు అసలు సంగతికి వచ్చేడు. స్వరం అంతకంతకి పెద్దదవుతూంది. తారస్థాయిలో నడుస్తూన్న ఆ సంగీతానికి గ్రామస్థులు మేల్కొని వినడం ప్రారంభించారు.

"సోదరులారా! ఒక్కమాట చెప్తావినండి. జపాను సామ్రాజ్య సైన్యాలకు మనమీద ఎంతప్రేమ వుందో చెప్పడానికి ఒక్క ఉదహారణ చాలును. క్రిందటి వేసవికిముందు హౌఫా, మేరోజ్‌లు పడుచుదనపు తొందరపాటుకొద్దీ జపాన్ చక్రవర్తి సైనికులకు ఏవిధంగా కోపంతెప్పించేరో మీరంతా ఎరుగుదురు. అసలు మార్షల్ లా ప్రకారం అల్లాంటివాళ్ళని కాల్చి పారెయ్యాలి. ఆవిధంగా చేయడానికి బదులు చక్రవర్తి సైనికులు వాళ్ళని పట్టణంతీసుకెళ్ళి, బుద్ధులు నేర్పేరు. ఈవేళ సుఖంగా వాళ్ళు మీదగ్గరికి తిరిగి వచ్చేరు."

హుఆ ప్రక్కకు తిరిగి వారిద్దరివేపూ చేయిపెట్టి చూపుతూ, "అరుగోవాళ్ళు. ఏమీ సందేహం లేదుగదా?"—అన్నాడు.

మేరోజ్ కళ్ళవలన ఆకర్షింపబడ్డ యువకులు కొందరూ, హౌఫా అంటే ఉత్సాహపడే కుర్రవాళ్లు కొందరూ 'హుర్రా' అని అరిచేరు. అధ్వమలమధ్య 'నాకొడుకే' యని వెర్రికేక ఒకటీ, మతిలేనిదాని నవ్వులాగ పెద్దనవ్వు ఒకటీ వినబడ్డాయి. లాఓ-ల్యూ భార్య కేకా, నవ్వూను అవి. తల్లిని చూడగానే హౌఫా వేదికమీదనుంచి గెంతబోయేడు. కాని, హుఆ చప్పుడుచేసి, అతనిని ఆపుచేసేడు. "నిశ్శబ్దం. మాట్లాడకండి." అని ఒకమారు అందరినీ హెచ్చరించి తన ఉపన్యాసం మరల సాగించేడు.

"జపాను సామ్రాజ్యసైన్యం మనకి శత్రువుకాదనే సంగతి ఇప్పుడు మీఅందరికీ తెలిసేవుంటుంది. మరల మనం మనపూర్వపు జీవితాలు గడపవచ్చు. పూర్వంలాగే వ్యవసాయం చేసుకోవచ్చు. అంటే మనం గొడవలు లేకుండా వుంటామన్నమాట. పూర్వం వుండే మునసబులు, వాళ్ళంతా పోతారు. మనం కొత్తజీవితం ఆరంభిస్తాం. మన గ్రామంలో శాంతినిర్వహణ సంఘం ఒకటి స్థాపించుకుందాం."

జమీందారు హులఅ గ్రామస్థుల ముఖాలవంక చూసేడు. కాని, వారు జన్మలో ఎప్పుడూ అటువంటిమాట విని వుండక పోవడంచేత మాట్లాడక వూరుకున్నారు.

"అయితే మీకేమీ అభ్యంతరం లేదన్నమాటే. మీరు మాట్లాడక పోవడం అంగీకారంగానే తీసుకుంటున్నా. శాంతి నిర్వహణం విషయంలో మీరందరూ ఈవిధంగా ఏకాభిప్రాయం వెలిబుచ్చినందుకు చాలా సంతోషంగా వుంది. అటువంటి సంఘానికి హాంగ్‌మీ అధ్యక్షుడుగా వుండడానికి అన్నివిధాలా తగివుంటాడని నా అభిప్రాయం. అతడు సమర్థుడు. చాకచక్యం వున్నవాడు. అతడు నాభూములమీద వుండి ఎల్లా పనిచేసేడో మీరంతా ఎరుగుదురు దయాదాక్షిణ్యాలున్నవాడు. గ్రామస్థులు నల్గురూ సుఖపడాలనే రకం మనిషి. మీఅందరితోనూ లావాదేవీలు వున్నవాడే. మీరే ఎరుగుదురు ఇవన్నీ. కాని, ఒక్కటుంది. పాపం అతనికి ఒక్కక్షణం తీరదు."

గ్రామస్థులంతా ఆశ్చర్యంతో విస్తుపోయి చూస్తూంటే జమీందారు ఒక్క నిముషం ఆగి మళ్ళీ అందుకున్నాడు.

"లాఓ-ల్యూ ఆతడికి డిప్యూటీగా వుండాలని నేను ప్రతిపాదిస్తున్నాను. ఆతడిని చిన్నప్పటినుంచి ఎరుగుదును. ఎన్నో ఏళ్లగా నాభూములు చేస్తూన్నాడు. పెద్దవాడు. నమ్మకస్తుడు. ఒక్క ఏడాది కూడా ఆతడు నాశిస్తు ఎగబెట్టలేదు. ఆతను తప్పకుండా ఈ నా సూచ

నను అంగీకరిస్తాడనే విశ్వసిస్తాను. తనకొడుకును క్షేమంగా ఇంటికి పంపేసిన జపాను సామ్రాజ్య సైన్యాలయెడ తనకుండవలసిన భక్తి శ్రద్ధలు చూపడానికైనా ఆతడు ఒప్పుకుంటాడు. ఏమంటావు ల్యూ ?" అని లాఓ-ల్యూ వంక తిరిగి ప్రశ్నించేడు.

తాను చేయవలసిన పనేమిటో తెలుసుకుందామని ల్యూ అనుకుంటూండగానే జమీందారు ఒక కాగితం మీద పేర్లు వ్రాసేసి మీసాలవాడిచేతి కిచ్చేడు. సభ ముగిస్తూ రెండు మాటలు చెప్పమని ఆతడిని అడిగేడు. ఆతడుకూడా మహా ఒయ్యారంగా వేదిక కొసవరకూ నడిచి వచ్చి గ్రామస్థులెవరికీ అర్థం కాని చీనాభాషలో ఉపన్యాసం ప్రారంభించేడు.

"శాంతి ఇంక నిర్వహించబడుతుందనే విషయం నాకు చాలా ఆనందం కలిగిస్తూంది. ఒక విధంగా చూస్తే మనం ఒకే జాతివాళ్ళమని చెప్పాలి. రెండోది మనభాషలుకూడా ఇంచుమించు ఒక్కలాగే వుంటాయి. మన జాతులు రెండూ స్నేహంగా, ఒకరికొకరు తోడ్పడుతూ వుండడం న్యాయం. ఉచితం. నేను జపాను సామ్రాజ్య సైన్యాలలో వాడిని." అంటూ ఆతడు తనపైన కప్పుకున్న నల్లగుడ్డ తీసేసేడు. ఆతని ఆకారం, మొలలోవున్న పెద్ద కత్తీ చూసేటప్పటికి మరి గ్రామస్థు లెవ్వరికీ సందేహం మిగలలేదు. "శాంతికీ, అభివృద్ధికీ ఆటంకంగా వున్నవాటిని నిర్మూలించడమే నాపని. ఆ శాంతిస్థాపనకే నీగ్రామ ప్రజలలో నువ్వు పనిచేయ గలుగుతావని హాంగ్‌మి! నాకు చాలా సంతోషంగా వుంది."

సంఘానికి కొత్తగానియమించబడ్డ అధ్యక్షుడు కృతజ్ఞతాపూర్వకంగా అభివాదనచేసేడు. మీసాలవాడు దానిని అందుకుని మరల ప్రారంభించేడు.

"ఇంతపవిత్రకార్యంలో ఆతనికి సహకారిగా వుండడానికి అంగీ కరించినందులకు లాఓ-ల్యూను అభినందిస్తూన్నా."

మీసాలవాడు ఒక్కనిముషం ఆగేడు. లాఓ-ల్యూకు అదిఅర్థము కాలేదు. మర్యాదకోసం నమస్కరించాలనే ఆచారాన్నీ ఎరిగడు. అందు చేత అతను లేవలేదు. పైగా జపానువాడు కనిపించడంతోటే అతడికి పైప్రాణాలు పైనేపోయేయి. అక్కడనుంచి ఎప్పుడుపారిపోదామా అని కనిపెట్టుకూర్చున్నాడు. జపానుసామ్రాజ్య సైన్యప్రతినిధి మరల "నిన్ను అభినందిస్తూన్నా లాఓ-ల్యూ" అన్నాడు.

'లాఓ-ల్యూ' అనే పిలుపుతో గ్రామస్థులమధ్య కూర్చున్న ఆతనిభార్య పిడుగుమొత్తినదానిలా ఒక్కవెర్రికేకపెట్టింది. "నా మొగుణ్ణి కాపాడండర్రోయ్!"

ఆ జపాను సైనికుని యూనిఫారమూ, ఆ కత్తీ చూసేటప్పటికే ఆమె ప్రాణాలు యెగిరిపోయేయి. దానికితోడు లాఓ-ల్యూ పేరు వినబడ గానే తనకొడుకును చెట్టుకు వేళ్ళాడదీసినట్లే మొగుణ్ణికూడా వేళ్ళాడ దీయడానికే అతణ్ణి పిలుస్తూన్నారనుకుందేమో వెర్రికేకపెట్టి మూర్ఛిల్లి నేలమీద పడిపోయింది. గ్రామస్థులంతా ఆమెవేపు పరుగెత్తుకు వచ్చేరు. సభఅంతా గందరగోళంలో ముగిసింది. కాని, ఒక్కటిమాత్రం సభ ముగిసేముందు ప్రకటించేరు. శాంతినిర్వాహణసంఘానికి సలహాదారుగా జపానువాడు గ్రామంలోనే వుంటాడని ప్రకటించబడింది.

లాఓ-ల్యూ, చిన్నమామాకలిసి ఆమెను ఇంటికి మోసుకుపోయేరు. ప్రాణం వుందా లేదా అన్నట్లు ఆమెపడివుంది. స్మృతి ఏమాత్రంలేదు. నాలుగురోజులకు ఆ మూర్ఛలోనే ఆమె కాళ్ళూ చేతులూ బిర్రబిగిసిపోయి నాయి. ఊళ్ళో డాక్టరులేడు. లూమింగ్ ఈ ఉప్పెనకి కారణం ఏమిటో చెప్పలేకపోయేడు. ఆవిడను ఇంతకాలమూ పట్టుకు పీక్కుతింటూన్న దయ్యం ఆమె ఆత్మని లాక్కుపోయివుంటుందనీ, ఆమె చచ్చిపోయే

వుంటుందనీ ప్రాళ్ళో ముసలివాళ్ళు చెప్పేరు. యుద్ధంరోజుల్లో శవపేటి కలు ఎక్కడొస్తాయిగనుక ? అందుచేత క్రింద ఒకచెక్క, పైన ఒక చెక్కపెట్టి ఆమె శరీరాన్ని సమాధిచేసేసేరు.

3

ఇంతకాలం శిధిలావస్థలోవున్న దేవుడుగుడికి ఇప్పుడు కొత్తకళ వచ్చింది. గోడలకు వెల్లవేసేరు. కప్పుమీద పెంకులు పోయినచోట కొత్తపెంకులు వేసేరు. కొక్కుపట్టిన ద్వారబంధాలూ, తలుపులూతీసి కొత్తవి పెట్టేరు. అసలు మొదట గుడి కట్టించినవారిపేరు చెక్కినరాతి పలకప్రక్కన జపానుచక్రవర్తి 'హిరోహిటో' పేరుతో మరొకరాతిపలక అమర్చబడింది. వీధిగుమ్మంప్రక్కన సైన్‌బోర్డు * నిలువునాచేర్చి కట్టబడి వుంది. దానిమీద "శాంతివిక్రయాణసంఘకార్యాలయం. 32 వ జిల్లా" అనేమాటలు వ్రాయబడి వున్నాయి. గుమ్మానికెదురుగా వాకిట్లో జెండా కొయ్యమీద ఉదయభానుణ్ణి చిత్రించినజెండా (జపానుజండా) ఎగురు తూంది. రెండురోజుల్లో ఈ మార్పులన్నీ జరిగిపోయినాయి ముందే ఆలోచించుకొని, చేయవలసిందంతా నిర్ణయంచేసుకుని జరిపినట్లు అన్ని పనులు టకటక జరిగిపోయినాయి.

గుడిసావట్లో ఒక పెద్దటేబిలు, దానిమీద ఫైర్మన్ అని రెండు పెద్దఅక్షరాలు వ్రాసిన కర్రపలక వున్నాయి. మంచిఅందమైన కుర్చీలో హాంగ్‌మీ కూర్చుండివున్నాడు. సంఘకార్యాలయానికి కాపలాదారుగానూ, పనివాడుగానూ నియమించబడ్డ ఆక్యూ గుమ్మంలో కూర్చుని, హాంగ్‌మీ ఇంతలావు ఎల్లాఅయ్యాడా ? అని ఆశ్చర్యంతో ఆలోచిస్తూన్నాడు. సంఘ

* చీనావ్రాత పైనుంచి దిగువకు నిలువునా వ్రాయబడుతుంది.

సభ్యు లింకెవ్వరూ రాలేదు. అయినా హాంగ్‌మీకి ఈ ఏకాంతం బాధక రంగా తోచినట్లులేదు. దేశంమునిగిపోయేటంత సమస్యవచ్చిపడితే ఆలో చన తెమలక తన్నుకుంటూన్నట్లు ఓనిమిషం కనుబొమ్మలు చిట్లిస్తూన్నా. మరోనిమిషంలో సమాధానం సాధించినట్లు చిరునవ్వు నవ్వుతూన్నాడు. మరోనిముషంలో తానొక కమిటీమీటింగులో కూర్చున్నట్లూ, తన సహ చరుల సలహాలను అంగీకరిస్తూన్నట్లూ భావిస్తూ తలవూపుతున్నాడు. ఈవిధంగా కొంతసేపు భావభంగిమలు ప్రదర్శించేటప్పటికి విసుగుదల పుట్టినట్లుంది. వెంటనే గొంతుచించుకుంటూ ఆక్యూను పిలిచేడు.

"పోయి టీ తే!"

అంతసేపూ హాంగ్‌మీ కూర్చున్నపడకకుర్చీ సౌందర్యాన్నీ, హాంగ్‌మీ భావభంగిమల్నీచూస్తూ మైమరచివున్న ఆమూర్ఖుడు కేకకు ఆదిరిపడిలేచి నిలబడ్డాడు. గబగబా పరుగెత్తివెళ్ళి వాకిట్లో ఒకమూల మూడురాళ్లు ఎత్తిపెట్టి, మంటబెట్టిన టీ కెటిల్ పట్టుకొచ్చేడు. యజమానికి తొందరగాటీ యివ్వాలనే ఆతురలో కెటిల్ సరిగ్గాపట్టుకోలేదేమో ఉడుకు తూన్ననీళ్ళు కొద్దిగా పాదాలమీద పడ్డాయి. అంత నడిశీతాకాలంలోకూడా అతని కాలికి జోడు లేదు. ఉద్యోగం ఇచ్చేరేగాని, జీతం ఇవ్వకపోవ దంచేత జోడు కొనుక్కోలేదు. కాళ్ళు కాలడంతో ఏడవకుండా వుండ లేకపోయేటప్పటికి ఛైర్మన్‌కు మహాకోపం వచ్చింది. విసవిసవచ్చి ఆక్యూ చేతిలోని కెటిల్ తీసుకుని, సాగతీసి ఒక్క లెంపకాయ కొట్టేడు. దానితో గూబ గుంయ్ మనిపోయింది.

"పనిలో ఎంతనేర్పుండాలి, ఎంతశ్రద్ధవుండాలి?"— అంటూ ఛైర్మన్ తన కుర్చీలో కూర్చుండి, ఒకకప్పు టీ తిరగబోసుకున్నాడు.

"నువ్వు ఇప్పుడొక ఆఫీసులో ఎంతో ముఖ్యమైనపని చేస్తూన్నా వనే సంగతి మరచిపోకూడదు. నువ్వు నా అంగరక్షకుడివి. నువ్వుచేసే ప్రతిపనీ గ్రామస్థులకు ఆదర్శంగా వుండాలి. తెలిసిందా?"

"తెలిసిందండి" అన్నాడే గాని పాపం ఆకుబ్యా కు ఏమీ తెలియ లేదు. హాంగ్‌మీ కొట్టినదెబ్బకు తల యింకా తిరిగి పోతూంది. మెదడు పనిచేసే స్థితిలోలేదు. రెండోవిషయం తాను చేయవలసిన పని స్వభావం ఏలాంటిదో ఇంతవరకు అర్థం కాలేదు. కాని. ఒక్కటి మాత్రం అర్థం అయింది. ఏక్షణంలో సైనాసరే ఛైర్మన్‌చేత లెంపకాయలు తినడానికి అవసరపడే వుద్యోగం లభించిందని అతనికి కొంతవరకు తెలిసింది. ఈ విషయం తెలియడంతోనే ఎవ్వరూ చెప్పనక్కర్లేకుండానే ఆతడు తగు జాగ్రత్తలో వుండసాగేడు. వెంటనే స్వరం, స్వరూపం కూడా సాధ్యమైనంతవరకు మార్చి అన్నాడు,—

"తమ పాదాలకాడివోడికి ఇప్పుడిప్పుడే తెలుస్తున్నాయండి."

"మంచిది, చలో జావ్‌!"

మళ్లీ ఆకుబ్యా కు గొప్పచిక్కు వచ్చిపడింది. పరిమితమైన ఆతని శబ్దకోశంలో 'చలో జావ్' అనేమాట ఎక్కడా అగతగలలేదు. కళ్ళప్ప గించి చూస్తూ ఛైర్మన్ ముందు నిట్రాటలా నిలబడి పోయేడు.

ఛైర్మన్ లేచి నిలబడి ఇదివరకటికన్న ఊతమైన మరో లెంప కాయ కొట్టేడు. "ఓరి! వెధవా! నీ చోటికి పొమ్మంటే అర్థం కాలే దటరా?"

ఈ రభసలో చైర్మన్‌కు కాలక్షేపం కాసాగింది. విసుగుదల పోయింది. నెమ్మదిగా కుర్చీలో చదికిలబడ్డాడు. ఆకుబ్యా తనచోటికి పోయి కూర్చుని మంటెత్తి పోతూన్న చెంపలు తడుముకోసాగేడు. ఈ మధ్య వ్యవధిలో కాస్త చల్లబడ్డ టీని ఒకటిరెండు కప్పులు చప్ప రించే టప్పటికి చైర్మన్‌కు పొగమీద భ్రమపారింది. ఒక సిగరెట్టు ముట్టించి, ఉంగరాలు తిరుగుతూన్న పొగవంక చూస్తూ కూర్చునేసరికి హఠాత్తుగా ఆతనికో విషయం జ్ఞాపకం వచ్చింది.

"ఒరేయ్ !"

ఆకేక వినడంతోనే అక్యూ లేచి నిలబడ్డాడు.

"ప్రొద్దుటే చెప్పిన పని చేసేవా?"

భయంతో ఒణికిపోతూ అక్యూ "చిత్తం చేసేనండి" అన్నాడు.

"లాఓ-ల్యూ చద్దికూడు తినగానే వస్తానన్నాడండి."

కేసు విచారణచేస్తూన్న జడ్జి పోజులో ఛైర్మను ఆశ్చర్యం, కోపం ప్రకటిస్తూ "చద్దికూడు తినడానికింత సేపా?" అని అడిగేడు.

"చిత్తం: ఏలినవారి పాదాలకాడివాడిని, నాకేమీ తెలియదండి. బహుశా పంచివస్తువేదన్నా వుందేమోనంటి. విశ్రాంతి తీసుకుంటున్నాడేమోనండి."

"ఏడిసేడులే. వెళ్ళి తీసుకురా, మనదేశానికి సంబంధించిన ఒక సమస్యమీదసలహా కావాలట ఛైర్మన్‌గారు రమ్మంటున్నారని తీసుకురా."

"చిత్తం చిత్తం"

హాంగ్‌మీ చెప్పిన కొత్తమాటలు వల్లించుకుంటూ అక్యూ గది లోంచి పరుగెత్తిపోయేడు. ఆ మాట మరిచిపోయేలోపున ల్యూ చెవిని పడెయ్యాలని అతని ఆతురత.

లాఓ-ల్యూకు ఛైర్మనుఆజ్ఞ అక్యూ ద్వారా పొద్దున్నే అందింది. నిజం చెప్పాలంటే ల్యూ ఏదో అత్యవసరమైన పనుండే కబురు వచ్చిందని నిశ్చయించేడు, గాని వెళ్ళడానికి భయపడ్డాడు. భార్యయొక్క హతాస్మరణం అతనికి విచారాన్నే గాకుండా జపాను సలహాదారు అన్నా ఛైర్మన్‌అన్నా విపరీతమైన భయంకలిగించింది. 'ఛైర్మను' 'డిప్యూటీ' 'సంఘం' 'సలహా' మొదలయిన శబ్దాలన్నీ అతనికి కొత్తే. ఏమీ అర్థం కావడంలేదు. అవి వింటేచాలు తలదిమ్మెత్తి పోతూంది.

ఈసమయంలోనే ఈ వెర్రిపీనుగ మళ్ళీ కబురుతెచ్చేడు.

"దేశానికి సంబంధించిన ఒక సమస్యమీద సలహా కావాలట. ఛైర్మన్‌గారు రమ్మంటున్నారు."

దారిపొడుగునా కంఠోపాఠంచేసిన ఆ వాక్యాన్ని తు. చ. తప్పకుండా వప్పగించేడు అక్యూ.

ఈ తెలివితక్కువ దద్దమ్మనుచూసి లాఓ-ల్యూ విచారపడ్డాడు. కాని రెండోమూల భయంకూడా పట్టుకుంది. గుర్రాలపెద్ద పనిచేసేవాడల్లా యిప్పుడు 'ఆర్డర్లీ' వుద్యోగం చేస్తున్నాడు. అదోకొత్తమాట. ఆ ఉద్యోగంయొక్క సంగతులు ఉద్యోగికే తెలియనప్పుడు ల్యూకు తెలియగల అవకాశం ఏం వుంది?

లాఓ-ల్యూకు తప్పలేదు. ఆర్డర్లీవెంట కాళ్ళు ఈడ్చుకుంటూ దేవుడిగుడివేపు బయలుదేరేడు. దేవుడిగుడి యిప్పుడు 'శాంతినిర్వహణ సంఘం' యొక్కఆఫీసుగా మార్చబడింది.

లాఓ-ల్యూ లోపికిరాగానే హాంగ్‌మీ చిరునవ్వుతో అభ్యుత్థానం చేసేడు. "ఓహో! డిప్యూటీఛైర్మన్! రా. కూర్చో. ఆకుర్చీలాక్కో."

"ఆలస్యంఅయింది. క్షమించండి సముద్దారుగారూ!" అని ల్యూ వసిగేడు.

"కాదు. ఛైర్మన్ అని పిలవాలి." అని చిరునవ్వుతో ల్యూ తప్పు దిద్దేడు హాంగ్-మీ.

"ఇకనుంచి నన్ను ఛైర్మన్ అని పిలవాలి. నువ్వు డిప్యూటీ ఛైర్మన్ అని పిలిపించుకోవాలి. తెలిసిందా? నిజంచెప్పాలంటే నాకు సముద్దారుపేరే నచ్చింది కాని, ప్రజలకి కొద్దోగొప్పో ఈవిధంగా సేవ చేస్తున్నప్పుడు దానికి సంబంధించిన పేరు తోసెయ్యడం ఎందుకని? నీకూ అలాగే తోచాలి న్యాయంచేత."

"ఉహూఁ!" అని ల్యూ ఒక్కనిముషం తటపటాయించేడు. ఆతనికి అలా తోచడంలేదుమరి. డబ్బుఖర్చు లేకుండా వచ్చిన బిరుదమే

అయినా అది వొదిలిపోతే చాలునని అతడున్నాడు. ఆవిషయం జాగ్రత్తగా చెప్పాలనుకుంటూండగానే ఛైర్మన్ మళ్ళా ప్రారంభించేరు.

"డిప్యూటీ ఛైర్మన్ ! పోనీ డిప్యూటీ లాట్-ట్యూ అంటే నీకు సమ్మతమేగద ?"

ముసలిరైతు ఏమీ మాట్లాడలేదు.

"సరే. అందులో పెద్ద మునిగిపోయేది ఏమీలేదులే. నీతో మాట్లాడవలసిన సంగతులు బోలెడన్ని వున్నాయి. కాని, చూసేవుగా. ఈ సంఘం స్థాపించినది మొదలుకొని నాకు ఒక్కక్షణం తీరిక వుండడంలేదు. ఈ జిల్లాలో పరిస్థితులు బాగుపరచడానికి ఎన్నో ఏర్పాట్లు చేయవలసి వుంది. ఈ లోపున జపాన్ సామ్రాజ్య సైన్యాలు మనకు చేసే సహాయాన్ని పూర్తిగా ఉపయోగపరచుకోవాలంటే వాళ్ళతో ఎన్నోవిషయాల మీద సంప్రదింపులు సాగించవలసి వస్తూంది. వాళ్ళదేశంలోని శాస్త్రవేత్తలు మనమూ-వాళ్ళూ ఒకేజాతికి చెందినవారమని నిరూపించినా వాళ్ళ స్వభావాలువేరు. అందుచేత వాళ్ళతో సంప్రదింపులు నడపడం బహు కష్టం. నాకు కుచోద్యాలు, కుచ్చితాలు తెలియవు. ముక్కుకి సూటిగా పోతాను. నువ్వెరగవు నన్ను? అటువంటివాడి నవడంచేత ఇదంతా మహా చెడ్డ బాధగావుంది. చెప్పొద్దూ. నీకూనాకు పరిచయం ఈనాటిదా? అందుచేత నేనెంత జాగ్రత్తగలవాడినో నువ్వూ ఎరుగుదువు. వాళ్ళఎదట అవమానం పొందకుండా, సాఫీగా, సక్రమంగా వ్యవహారాలు పరిష్కరించుకోవాలని నాసంకల్పం. నేను చెప్పింది తెలుస్తూందికాదూ ?"

"తెలియకేం. మీరు చాలా కష్టపడుతున్నారు. మనవూళ్ళో ఇంకెవ్వరూ ఆ విధంగా పనిచెయ్యలేరు."

"ఆ. సరిగ్గా చెప్పేవు!" అని హాంగ్‌మీ ఆతనిని అభినందించాడు.

"సరియైన స్నేహితుడవంటే నువ్వే. చూసేవుకాదు, అందుచేతనే నన్ను ఛైర్మన్‌ని చేసేరు. ఇందులో ఏమీ సుఖం అనేదిలేదు.—"

అంటూ నిజంగా ఆ ఉద్యోగం తనకు అయిష్టం అయినట్లే కను బొమలు చిట్లించేడు. "కాని, ఇక్కడ ఒక్కసంగతి నువ్వు తెలుసుకో లేదు. అల్లాగ అన్నానని తప్పుపట్టుకోకేం. జపాను వాళ్ళు మనల్ని లోకువ చేసేలాగ ప్రవర్తించకూడదు. అంటే, మనదేశంలో శాంతి, భద్రతలు స్థాపించడానికి జపానువాళ్ళచేత డబ్బు ఖర్చుపెట్టించకూడదు. వాళ్ళు మన యింటికి వచ్చిన చుట్టాలు. నామాట అర్థం అయిందా ?"

లాఓ-ల్యూకి అర్థం అయిందని చెప్పడానికి వీలేలేదు. బట్టతల బరుక్కున్నాడు. కాని లాభం లేకపోయింది.

"చెప్తున్నాచూడు. మన ఆఫీసు వుందిగదా ? ఇదంతా శిధిలమై పోయివుండేదని నువ్వూ ఎరుగుదువు. దానిని వాళ్ళు బాగుచేయించేరు. ఈ యుద్ధంరోజుల్లో ఇంతత్వరగా ఎవరు బాగుచేయించగలరు ? జమీం దారుగారికూడా సాధ్యంకాదు. ఆపని చేయించడానికి జపాన్ సామ్రాజ్య సైన్యాలు మనకు కొంత సొమ్ము శాంక్షన్‌చేసి ఇప్పించేరు. ఆవిధంగా మన స్నేహితుని సొమ్మును మింగివేయడం మనకు మాత్రం ఉచితమా? శాంతిస్థాపనకు వాళ్ళ సేనల సహాయం మనకు కావాలనుకో. అయినా ఇల్లాంటి చిన్న విషయాలకోసం వాళ్ళమీద మనం ఆధారపడకూడదు."

"ఇతరులడబ్బు, ముఖ్యంగా విదేశీయులడబ్బు మనం వాడుకో వడం ఉచితంకాదు." అన్నాడు ల్యూ. తమపూర్వులు కట్టించిన దేవాల యాన్ని బాగుచేయించటం కోసం ఆపాడుసొమ్ము ఖర్చుపెట్టేరన్నవార్త ఆతనికి అసహ్యం కలిగించింది.

హాంగ్-మీ సంతృప్తి ప్రకటిస్తూ "అమ్మయ్య ! ఎంతసేపటికి నీనోట మాట వూడిపడింది ?" అన్నాడు.

"అందుచేత మనం ఆడబ్బంతా తిరిగి ఇచ్చెయ్యాలి. అంతా కలిసి మనం ఇవ్వవలసిన సొమ్ము ఓ వంద డాలర్లుంటుంది. మనవూళ్ళోవున్న

కుటుంబాలు ముప్ఫయిమూడు. నూరును ముప్ఫయిమూడెట్టి భాగించు. అంటే ఇంటికి మూడు డాలర్లుచొప్పున ఇవ్వవలసివస్తుంది. కాని ఇంకో డాలరు మిగిలివుంటుందికాదూ? జమీందారుగారితో చెప్పి ఆడాలరును ఆయనచేత ఇప్పిస్తాను."

పరిస్థితులు అర్థం కావడంతోనే లాఓ-ల్యూ గుండెలు పీచుపీచు మన్నాయి. "అయితే ఆడబ్బంతా ఇచ్చెయ్యాలంటారా?"

"తప్పకుండా. నువ్వూ ఇచ్చివేయవలసిందే నన్నావుకాదూ?" అంటూ హాంగ్‌మీ ల్యూవంక తీక్ష్ణంగా చూసేడు.

లాఓ-ల్యూ ఏమీ సమాధానం ఇవ్వలేదు. తల వ్రేలేసుకుని ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. పెళ్ళాం చచ్చిపోయినతర్వాత ఆతడు యింట్లో గుడ్డిగవ్వకూడా చూడలేదు. ధాన్యం అమ్మి డబ్బుతెద్దామంటే ఇంట్లో ఒక్కగింజలేదు. విత్తనాలకోసం వుంచిన బార్లీ గింజలు తినేస్తూన్నారు. అవికాస్తా తినేస్తే పంటవేసే రోజుల్లో నానాబాధలూ పడాలిసి వస్తుంది. పైగా తనకొడుకు జపానువాళ్ళ చేతులనుంచి గోచీగుడ్డతో బయట పడ్డాడు. చలికి వొణికిపోతూన్నాడు. అతనికి చలి ఆపే దుస్తులు ఏమన్నా కొనాలి.

"ఈ విషయంలో నువ్వు మరొకలాగ చెప్పడానికి వీలులేదు. దీన్ని వెంటనే సర్దుబాటు చేయవలసివుంటుందికూడా. మర్యాద చెడిందీ అంటే ఈ జపానువాళ్ళతో ముందుముందు ఏదన్నా వచ్చినపుడు మాట్లాడ్డం అసంభవం అయిపోతుంది."

ఛైర్మన్ ఈ మాటలంటూ చూసిన చూపులకు లాఓ-ల్యూ గజ గజలాడిపోయేడు.

"డిప్యూటీ ఛైర్మనువి నువ్వు. నీ అధికారాన్ని గ్రామస్థుల మీద చూపించడానికి నీకింతకన్న మంచి అవకాశం దొరకదు. ఆ పని నేనే చేసివుందును. కాని బోలెడంత పని వుండిపోయింది నాకు. జపాను

సామ్రాజ్య సైన్యాలతో ఎన్నో సంప్రదించవలసిన రాజకీయాలు మిగిలి పోయినాయి. నీకు తెలియదా యేమిటీ? అందుచేత నువ్వే పోగుచెయ్యాలి డబ్బు. ప్రజలకు పనికివొచ్చే పనులంటే నువ్వెప్పుడూ సందేహించవు. అందుకనే నీకిది వొప్పచెప్తున్నా. ఈ విషయంలో శక్తివంచన లేకుండా కష్టపడి పనిచెయ్యాలి. అయితే. ఎన్నాళ్ళలో వసూలు చెయ్యగలవు? ఒక వారం పడుతుందా? ఒకవారంలో ఖచ్చితంగా వసూలు చెయ్యాలిసుమా!" అంటూ ప్రశ్నలూ, సమాధానాలు తానే ఇచ్చేడు.

ఈ మాటలకు లాఓ-ల్యూ నిర్విణ్ణుడై కూర్చుండిపోయేడు. ఆతని కళ్ళముందు మూడుడాలర్లు గిర్కీలు కొడుతూన్నాయి. ఈ రోజుల్లో మూడుడాలర్లు మూడువందల డాలర్ల పెట్టు. ఊళ్ళో ఒక్కడూ చెల్లించ లేడు. అమ్మి యిచ్చేటందుకేనా ఒక్కడివద్దా ధాన్యంలేదు. జపాన్ దాడుల మూలంగా తాకట్టుపట్టేవాళ్ళు కూడా తాకట్టుమీద సొమ్ము ఇవ్వడం మానే సేరు. ఒకవేళ ఇస్తేమాత్రం తాకట్టుపెట్టేటందుకు ఎవరిదగ్గర ఏముంది? తన కొడుక్కి చలికాలపు దుస్తులు కొందామని తనతిన్న తాను ప్రయ త్నించడంలేదు? ఇవన్నీ మనస్సుకి తట్టడంతోనే ల్యూ ప్రకృతిలో పడ్డాడు. ముడతలుపడ్డ ముసిలితల బరుక్కుంటూ "డిప్యూటీ ఛైర్మన్ కూడా ఇవ్వాలా?" అని గొణిగేడు.

ఛైర్మన్ ఒక్కక్షణంకూడా ఆలోచించకుండా. "ఆహా. తప్ప కుండా. ప్రజాతంత్రం అంటే ఏమిటనుకున్నావు? మనం ఇంత కష్టపడు తూన్నదీ దానికోసమేకాదూ? ఇక్కడ ఒకరు హెచ్చు. ఇంకొకరు లొచ్చు ఆనేది వుండకూడదు. తెలిసిందా?"

ఏమిటి తెలిసేది? ఇక్కడ ఎక్కువ-తక్కువ తప్ప అసలు మరొకటి లాఓ-ల్యూకు కనబడ్డమేలేదు. ఛైర్మన్‌కు తానుకూడా ఒకవాటా భరించాలననే ఆలోచన వున్నట్లే తోచడంలేదు. జమీందారు హూఅ మహా

యిస్తే ఒకడాలరు ఇస్తాడట. అదయినా ఛైర్మన్‌గారి సిఫార్సుమీద. కాని ఈవిషయంలో చర్చించినా ప్రయోజనంలేదు. ఇప్పుడామూడుడాలర్లు తాను ఎల్లాగ ఇవ్వడం? గ్రామస్థులనుంచి ఏలాగ వసూలుచేయడం? అనే ఆలోచన తప్ప మరొకటి ఆతని బుర్రలో మెదలడంలేదు. వూళ్ళోవున్న తిండికరువు పరిస్థితులు చూస్తే అదేమీ సాధ్యమయే పనిలా కనబడ్డంలేదు.

లాఓ-ల్యూకు ఏడుప్పు వచ్చినంత పర్యంతం అయింది. "నేనేదో మట్టి పిసుక్కుని బ్రతికేవాడిని. చదువుసంధ్యలు లేనివాడిని. మీకు డిప్యూటీగా వుండతగను. నాకంటె చేతనైనవాణ్ణి ఇందులో పెట్టుకుంటే బ్రతికిపోతాను." అని ప్రార్థించేడు.

హాంగ్‌మీ చవటనవ్వు నవ్వుతూ, "అల్లాగంటే ఎల్లాగోయ్! ఇదెంత పవిత్రమైన పనో ఆలోచించావా? మన ఇరుగుపొరుగువాళ్ళ శాంతిభద్రతలలో సుఖజీవితం గడపడానికి తోడ్పడడం అన్నమాట. అటువంటి వుద్యోగాన్ని వొద్దనడం ధర్మంకాదు. పైగా జపాన్ ఆఫీసరే నిన్ను డిప్యూటీగా వుంచడానికి ఒప్పేసుకున్నారు. మరిచిపోయావేమిటి?"

ఆ మనిషిని చూసి తన పెళ్ళాం హడలి చచ్చిపోయింది! అటువంటివాడిని మరిచిపోతాడా? అందుచేత మరువలేదన్నట్లు తలవూపేడు.

"నీకు మంచి జ్ఞాపకశక్తి వుంది. నాకు తెలుసు. నీకు వుద్యోగం చెయ్యాలని లేకపోతే, వెళ్ళి ఆయనతో మాట్లాడు."

"అయ్యా! పెద్దవాడినైపోయేను. నన్ను వదిలి........"

లాఓ-ల్యూ మాట పూర్తి చెయ్యలేకపోయేడు. ఆమాటలు విననివాడల్లే హాంగ్‌మీ మధ్యలో "ఆర్డర్లీ! పత్రిక తీసుకురా" అని అరిచేడు.

ఆర్డర్లీ, కునుకుతూన్నవాడల్లా ఆకేకకు ఉలికిపడి లేచేడు. గబగబ పరుగెత్తిపోయి ఒక ముక్కాలిపీటమీద చిందరవందరగా పడివున్న కాగితాలలోంచి బాగా మాసిపోయి, చిరిగిన, నెలపదిహేనురోజుల క్రితంనాటి పత్రిక ఒకటి తెచ్చి యిచ్చేడు.

అది జపానువాళ్లు పెకింగ్‌నుంచి ప్రకటించుతూన్న దినపత్రిక. జపానువారు ఆశియాలో స్థాపించుతూన్న నూతనరాజ్యాంగ పద్ధతులు. జపాను సామ్రాజ్య సైన్యాలు పొందుతూన్న విజయపరంపరలతోపాటు జపాను సైనికులు చీనా స్త్రీలతో నెయ్యం, సౌభ్రాతృత్వం నెరపుతూన్న గాధలు, బొమ్మలుకూడా ఆపత్రికనిండా వున్నాయి. ఛైర్మన్ తల వూపుతూ పుటలు తిరగేసేడు. అదేదో మహోత్తమగ్రంథం అయినట్లు, ల్యూ అక్కడున్న సంగతికూడా మరిచి పత్రికా పఠనంలో మునిగి పోయేడు.

ఇంక చేసేదిలేక లాఓ-ల్యూ నెమ్మదిగా వీధిలోకి పోయేడు. ఆతడు పోతూంటే ఛైర్మన్ పేపరు వెనుకనుంచి తొంగిచూసేడు. గుమ్మంవద్ద ఆర్డర్లీ ఆక్యూ నమస్కారం చేసేడు.

"నమస్కారం! డిప్యూటీ ఛైర్మన్‌గారూ."

లాఓ-ల్యూ ఆ నమస్కారం అందుకొనేస్థితిలో లేడు. ఏడుపు తన్నుకుంటూ వస్తూంది.

౪

సావిట్లో బెంచీమీద కూర్చుని లాఓ-ల్యూ పరధ్యానంగా వీధివేపు చూస్తూన్నాడు. ఆతని ప్రక్కనే జమ్ముకొడలకట్ట ఒకటుంది. కాని, ఇంతవరకు అతడు దానిని ముట్టుకోలేదు. ఏమీ తోచనప్పుడు జమ్ము కొడలతో చెప్పులల్లడం ల్యూకు సరదా. ఆ అలవాటు ఇప్పటికీ ఆతడు విడిచిపెట్టలేదు. ఎప్పుడూ ఏదో పనిచేసే మనిషి వట్టినే ఊరుకోవడం కష్టం. కోతలు, నూర్పిళ్లు అయిపోయాక శీతాకాలంతో ఎక్కడికీ కదల కుండా వట్టినే కూర్చోడం ఆతనికి మహాకష్టంగా వుంటుంది. అల్లాం టప్పుడు జమ్ముకొడలతో జోళ్ళు అల్లుతూ పని కల్పించుకుంటాడు.

ఆపనిలో ఏముందోగాని, మహాఉత్సాహం పొందుతాడు. జమ్ము పర కలు ముట్టుకొనేటప్పటికి తోచకపోవడం, అన్నీ ఎగిరిపోతాయి. అర్ధ రాత్రీ, అపరాత్రీ కూడా తెలియదు.

కాని, ఈవేళ ల్యూ ఒక్క కాడకూడా ముట్టుకోలేదు. పనిచేయ డానికే ఆతడా బెంచిమీదికి వచ్చి కూర్చున్నా. ఆతనిచేతులు కదలడం లేదు. ఆతని మనస్సు అక్కడలేదు. మూడు డాలర్లూ తేవడం ఎల్లాగా అనే ఆలోచనలో కొట్టుమిట్లాడి పోతున్నాడు. పంట పండితే ఆవొక పెద్దలెక్కకాదు. కాని, ఈవేళ గాదెలో ఒక్కగింజలేదు. అప్పు తేవ డానికి ఎవ్వరివద్ద మాత్రం ఏముంది ? పైగా దట్టంగా మంచుతెర కురు స్తూంది. వాకిట్లో ఒక కాకి ఏదన్నా దొరుకుతుందేమోనని ముక్కుతో మంచు అటూ, ఇటూ చిమ్మింది. కాని, ఏమీ దొరక్కపోవడంచేత ఏడుస్తూంది.

హౌఫా ఇంకో బెంచిమీద కూర్చుని జోళ్ళు అల్లుకుంటున్నాడు. ఆతని కీ ప్రపంచం గొడవ ఏమీ ఉన్నట్లులేదు. వొణికించేస్తూన్న ఆచలిలో వొంటిమీద గుడ్డలేదనే ధ్యాసే వున్నట్లులేదు. నెమ్మదిగా పల్లెటిపదాల స్వరంలో ఒకగీతం ఆలాపిస్తూన్నాడు.

"అయ్యో ! అయ్యో ! నామనస్సును విలుపలేనె యే రోజూ !

నీముద్దులొలుకు మోముచూడ మనస్సు పీకు మేరోజూ ! "

రైలురోడ్డుమీద పనిచేసేటప్పుడు గ్యాంగుకూలీలు ఈపాట కట్టేరు. హౌఫాను జపానువాళ్ళు పట్టణం తీసుకెళ్ళి, రైలురోడ్డు పనిలో, పెట్టేరు. మేరోజును కూడా అప్పుడేకాదు లాక్కుపోయేరు ? ఈవూళ్ళో నేడు సలహాదారుగా వుంటూవున్న జపాను ఆఫీసరు అప్పుడు అక్కడ కెప్టెన్‌గా వుండేవాడు. ఆతని యింట్లో దాసీపనికి పెట్టేరు మేరోజ్‌ని. ఆవిడకు ఇంత 'తేలికపని' ఇవ్వడానికి కారణం ఆమె దానికి తగివుంటుం దనికాదు. "ఆమె పెద్దపెద్దకళ్ళు, కొనదేరిన ముక్కు" మీద కెప్టెన్

మక్కువపడ్డాడని గ్యాంగుకూలీలు చెప్పుకునేవారు. జపాను యజమాని అంటే మేరోజుకి ఏమాత్రం ఇష్టంలేదు. రాత్రిపూట వాడిఎదుటకి రావడం ఆమెకి అసహ్యం. అందుచేత సందుచూసుకొని పారిపోయి హౌఫా ప్రక్క కూర్చుని సరాగాలాడుతూండేది. త్వరలోనే మేరోజ్‌కు కూలీలతో కత్తు కలిసి పోయింది. ఆమె జపాను యజమాని పొట్టిరూపమూ, వాడి ఆకారము, నడక, మాటలూ అభినయిస్తూంటే వాళ్ళంతా విరగబడి నవ్వుతూండేవారు. ఆచలిలో వాళ్ళకి అదో కాలక్షేపంగా వుండేది. ఆవిడ మీద నలుగురూ ఓపాట తయారు చేసేరు. ఆమె లేనప్పుడు ఆపాట పాడుకొనేవారు.

పాట వినికాదు గాని, నిర్విచారంగా వున్నకొడుకు ధోరణిచూసి లాఓ-ట్యా మనస్సు గంతులేసింది. నెమ్మదిగా లేచి అతనివద్దకు వెళ్ళి భుజం తట్టేడు. "ఎంత నిర్విచారంరా! అల్లా వుండాలనుకున్నా వుండ లేకపోతూన్నాను."

ఆ యువకుడు ఆశ్చర్యంతో తండ్రి ముఖంలోకి గుచ్చిగుచ్చి చూసేడు. "ఏం నాన్నా! అంత విచారంగా వున్నావు. అమ్మ చచ్చి పోయింది. పోయినవాళ్ళు ఇంక తిరిగిరారు. ఆవిణ్ణి గురించి విచారపడి లాభం ఏమిటి?"

ముసిలివాడు "అదికా" దన్నట్లు తలవూపేడు.

"మీ అమ్మను గురించి ఆలోచించి లాభం లేదని నేనెరుగుదును. పాపం, దానిని మరిచిపోయేందుకే ప్రయత్నిస్తూన్నా. నావిచారం అంతా ఆమూడు డాలర్ల కోసమే."

"డాలర్లేమిటి?" అన్నాడు హౌఫా ఆశ్చర్యంతో.

"జపానువాళ్ళ కివ్వాలట. ఛైర్మన్ నన్ను మూడుడాలర్లు ఇయ్య మన్నాడు. ఊరందరివద్దా ఇంటికి మూడు డాలర్ల చొప్పున వసూలుచేసి తెమ్మన్నాడు."

"మరి ఏం చేద్దామనుకుంటున్నావు?"

"ఏమీ తోచడంలేదు."

"తోచడం లేదంటే ఎల్లాగ? జపానువాళ్ల దగ్గిర కెళ్ళి నాకు తోచడం లేదంటే లాభంలేదు."

"అయితే ఏం చెప్పమంటావు?"

ఆయువకుడు ఒక్క నిముషం ఆలోచించేడు.

"డబ్బులేదని చెప్పెయ్యి, జపానువాళ్ళదగ్గిర పనిచేస్తూన్న సముద్దారుకు డబ్బుకాదు ఇవ్వడం" అని ఆతఁడు పిడికిలి బిగించి ఆడించేడు.

ముసిలివాడు కనుబొమలు చిట్లించి, తల ఆడించేడు. ఆతనికి ఆ అభిప్రాయం నచ్చలేదు.

"నీకు తొందరపాటు ఎక్కువరా నాయనా! నీకింకా ప్రపంచం సంగతి తెలియదు. పిడికిళ్ళతో పనులవుతాయా?"

తొందరపాటువలన ఈయువకుడు జపానువాళ్ళకి ఏలాగ కోపం తెప్పించాడో, వాళ్లు ఈతడిని చెట్టుకి ఎట్లు వేళ్లాడదీసేరో, అది చూసి ఆతని తల్లి యెల్లా కృంగిపోయిందో ముసిలివాడి కళ్ళముందు ప్రత్యక్షం అయినాయి. ఆ ఆలోచనలు ఆతనికి విచారం కలిగించేయి. ఆపడుచువాడి ప్రక్కన నిలబడలేక పోయేడు. "బలం ప్రయోగిస్తే, బాధలు తగ్గడానికి బదులు మరింత ఎక్కువౌతాయనేది నువ్వు జ్ఞాపకం వుంచుకోవాలి" అంటూ ఆతడు బైటికి వెళ్లిపోయేడు.

ఆ వెళ్ళడం సరాసరి చిన్నమామ ఇంటికేసి వెళ్ళేడు. తన పాతకాలంనాటి స్నేహితుడితో తన బాధలన్నీ చెప్పుకుందా మనుకున్నాడు. తమ యిద్దరికీ మధ్యనున్న స్నేహంకొద్దీ, తాను కష్టంలోవున్న విషయం చూసి జాలిపడి ఏదోవిధంగా తన మూడు డాలర్లూ ఇస్తాడని కూడా ఆశ పడ్డాడు. అవి చూపించి మిగిలినవాళ్ళనికూడా అడగొచ్చునని ఆతనివూహ.

శాంతి నిర్వహణ సంఘం స్థాపించిననాటి తతంగం అంతా చూసే టప్పటికి చిన్నమామకు మహా సరదా వేసింది. ఆ హడావిడి, జపాను ఆఫీసరు అంత సౌమ్యంగా అక్కడ కూర్చోడం, ల్యూ భార్య మూర్ఛ పోవడం ఇవన్నీ అతని మనస్సులో హత్తుకుపోయేయి. లాఓ-ల్యూను డిప్యూటీ చైర్మనుగా ప్రతిపాదించడం, తమరందరిఎదుటా జపాను ఆఫీ సరు దానిని స్థిరపరచడం ఆతని మనస్సులో మెదులుతూన్నాయి. ఇంత వరకు రైతు వాడికెవ్వడికీ ఆవిధమైన ఉద్యోగం దొరకలేదు. "వాళ్ళు నాకెందు కివ్వకూడదు ఆ వుద్యోగం?" అని తనకు తానే లక్షసార్లు ప్రశ్నించుకున్నాడు. కాని, దానికి సమాధానం ఏముంది?

తన చిన్ననాటి స్నేహితుడు ఇప్పుడు తన గుడిసెలోకి రావ డంతో ఆతనికి భయమూ, అనుమానమూ కూడా కలిగేయి. ఆ ముసిలి వానివంక చూసి, "ఇతడేనా సంఘానికి డిప్యూటీ చైర్మను?" అను కున్నాడు. లాఓ-ల్యూలో మార్పేమీలేదు. ఆసలే రెండేసి పరకలున్న కనుబొమ్మలు ముడివెయ్యడం తప్ప మరోకొత్తదనంలేదు. "ఈడిప్యూటీ నాకంటె ఏవిధంగా ఎక్కువ? కేవలం అదృష్టం" అని యాతడు తన్ను తానే ఓదార్చుకొన్నాడు. కాని, తనకు తెలియకుండానే ఆగంతుకుడికి అతడు అభివాదనం చేసేడు.

"నీకు వుద్యోగం దొరికేక ఎప్పటికప్పుడే రావాలనుకుంటున్నాను. కాని ఆపనీ, ఈపనీతోనే సరిపోతూంది. అన్నా!....అన్నట్లు వుద్యోగస్తు డివికాబోలు, 'అన్నా' అని పిలుస్తే కోపంరాదుగద? అదృష్టవంతుడి వోయ్! మంచి వుద్యోగం సంపాదించేసేవు!"

ఆశ్చర్యంతో ల్యూ తన చిన్ననాటి మిత్రుని ముఖం ఎగాదిగ చూసేడు.

"నీకేమన్నా మతి పోయిందేమిటి ? ఏమిటా వెర్రిధోరణి?"

చిన్నమామకు చాలా ఆశ్చర్యం కలిగింది. "ఏం ? నువ్వు ఉద్యోగివికాదా ? నేను మామూలు కూలిపని చేసుకొనేవాడిని. నువ్వు గ్రామ పెత్తందారుకు డిప్యూటీవి. వెనకటిలాగే అన్నా అనిపిలిచినా మన అంతస్థుల్లో తేడాలేదూ?"

"తెలివితక్కువగా మాట్లాడుతున్నావు. కావాలంటే ఆ ఉద్యోగం నువ్వే తీసుకో. ఉద్యోగం అంటే ఊళ్ళో ప్రతివాళ్ళనుంచీ ఇంటికి 3 డాలర్లుచొప్పున వసూలు చెయ్యాలి. తెలుసా?"

"ఏమన్నావు అన్నా ! ఇంతవరకు చెప్పేవేకావు. నిన్ను 'అన్నా అని పిలవ్వచ్చునా?" అన్నాడు చిన్నమామ. ల్యూ చెప్పిన మాటలు ఆతనిలో వుత్సాహం కలిగించాయి. కాని, ఆఖరు వాక్యం ఏమిటో అర్థం కాలేదు.

లాఓ-ల్యూ ఉద్యోగంమీద బలపాటం పడుతూన్న తన మిత్రుడికి జపానువాళ్లకోసం డబ్బు వసూలు చేయవలసిన విషయం అంతా చెప్పి, అదివేగంగా జరిగిపోవాలన్నాడు. కొనకంటా విన్నాక చిన్న మామకు ఉద్యోగంమీద మమకారం, మోజు అంతర్థానం అయిపోయేయి.

"అలాగనా ? మహా కష్టమైనపనేనే ! అందుకే ఆపని నీకిచ్చేరు. అన్నా ! నువ్వు సమర్థుడివి, గట్టివాడివీకూడా. నేనెందుకూ పనికిరాని వట్టి బడుద్ధాయిని. సోమరిపోతుని. వయస్సు వెళ్ళిపోయింది. ఏ పనీ చెయ్యలేను. మహారావుజుగాని, నన్నుమాత్రం డిప్యూటీపనికి సిఫార్సు చేయబోకేం. కుక్కో, పిల్లో, గాడిదో, కప్పో కనబడిందనుకుని దాన్ని ఎల్లా లెక్కచెయ్యమో అల్లాగే నన్నూ మరిచిపో, నీపుణ్యముంటుంది."

ధారా ప్రవాహంగా వస్తూన్న ఈ ఆత్మనింద వినేటప్పటికి ల్యూ బెంబేలు పడిపోయేడు. నిజంగా తన మిత్రుడికి మతిగాని పోలేదుగద ? కాని, తనపని సులువుగా తెమిలేలా కనబడవేదు. కుళ్ళిపోయిన కుక్కని

దూరంగా విసిరేసినట్లు ప్రతివాళ్లు ఈ వుద్యోగాన్ని దూరంగానే నెట్టడానికి చూస్తారని తెలుసుకున్నాడు. కాని, దురదృష్టవశాత్తూ దాన్ని తెచ్చి వాళ్ల తనచేతుల్లో పెట్టేరు. తనదురవస్థకు తనకే విచారం కలిగింది. కళ్ళనీళ్ళు తిరిగేయి.

"చిన్నమామా! నువ్వీమాటు సాయంచేయకతప్పదు. ఒక్క మూడు డాలర్లు...."

చిన్నమామ ఆమాటలు విననట్లు, విన్నా అర్థంకానట్లు నటిస్తూ, ఎందుకూ పొందకుండా సమాధానం ఇచ్చేడు.

"ఈ వేళ మహాచలిగా వుందోయి. వొణికించేస్తూంది. ఈవారం అంతా గంజిలో మెతుకులుకూడా లేవనుకో. ఆవెధవనీళ్ళు తాగుతే ఒంటికి వేడివస్తుందా? బలంవస్తుందా? పోనీఅంటే ఒక్క గింజకూడా లేకుండా జపానువాళ్ళు తుడుచుకుపోయేరు."

చిన్నమామ మాటలను నమ్మకపోవలసిన అగత్యంలేదు. బహుశా తిండిలేక చెవులు దిబ్బడులువేసి తనమాటలు వినబడ్డం లేదుకాబోలు ననుకున్నాడు ల్యూ. అందుకని కొంచెం గట్టిగా "నేనుచెప్పేది ఆమూడు డాలర్లూ...." అన్నాడు.

చిన్నమామ తడుముకోకుండా సమాధానం ఇచ్చేడు.

"తప్పకుండా. కాని, చూడు: మేరోజ్, లూమింగువొంటరివాళ్ళు. ఇల్లువాకిలి గొడవలేనివాళ్ళు. ఇస్తే వాళ్ళివ్వాలిగాని, నావద్ద ఏముంది? మేరోజ్ మళ్ళీ కోళ్ళని పెంచుతూంది. బియ్యం లేకపోయినా రోజూ ఒకగుడ్డు తింటూంది. ముందుఏడాది పంటల్ని గురించీ, జపానువాళ్లని గురించీ లూమింగు ఇంకా ప్రశ్నలు చెప్తూనే వున్నాడు. కొద్దోగొప్పో డబ్బు సంపాదిస్తూ వుండివుంటాడు. ఒక్కక్షణంక్రితమే చూసేను. ఇంటి వద్దనే వున్నాడు. నిల్చున్నపళాన వెళ్ళి వాడిని పట్టుకో. మళ్ళీ ఎక్కడి

కేనా పోగలడు. వెయ్యిగుళ్ళ పూజారి. నేచెప్పిన మాటవిను. వాడివి పోయిపట్టుకో."

ప్లేగును వదుల్చుకున్నట్లుగా ల్యూను చేయిపట్టుకు తీసుకుపోయి. పీధిగుమ్మంలో దిగబెట్టి, ఆతడు గభీమని తలుపు వేసుకొన్నాడు. ల్యూను పంపించేసి చిన్నమామ పెద్ద నిట్టూర్పువిడిచేడు.

"పోయేడురా బాబు! బ్రతికేమ." ఎప్పుడూ ఎరగనివిధంగా వ్యవహరించిన చిన్నమామ ఈ ధోరణికి లాఓ-ల్యూ విస్మితుడయ్యేడు. యుద్ధాలు, కరువులరోజుల్లో మనుష్యులు మర్యాద మరిచిపోతారని పెద్దలు చెప్పినమాట జ్ఞాపకం వచ్చింది. కాని, చిన్నమామలాంటి చిన్ననాటి స్నేహితుడు ఇంతత్వరలో ఇల్లా మారిపోగలుగుతాడని ఆతడు ఎన్నడూ వూహించలేకపోయేడు. మానవస్వభావం ఏవిధంగా చెడిపోతుందో ఆలోచిస్తూనే ల్యూ లూమింగు ఇంటిదగ్గరకు వచ్చేసేడు. గుమ్మంవద్ద నిలబడి, తలుపుసందులోంచి దొంగలాగ తొంగిచూసేడు. తర్వాత పిలవకుండానే తలుపులు తోసుకొని ఇంట్లోకి వెళ్ళేడు.

జ్యోతిషానికి సంబంధించిన ఒక సిద్ధాంత గ్రంథాన్ని లూమింగ్ ఎంతో ధ్యానంతో చదువుతున్నాడు. నాలుగు రోజులక్రితం పక్కవూళ్ళో జపానువాళ్ళు ఒకయిల్లు అంటించేసి ఇంట్లోవాళ్ళని లాక్కుపోయేరు. ఆ తగులబడిపోయిన యింట్లో తినడానికి ఏదన్నా దొరుకుతుందేమోనని లూమింగ్ వెతుకుతూంటే తుక్కులో ఆపుస్తకం దొరికింది. అందులో వున్నవన్నీ కొత్తసిద్ధాంతాలు. ఎంతో విలువగలవి అనడంలో సందేహం కనబడ్డంలేదు. తనవృత్తికి చాలా సహాయపడవచ్చు. అందుచేత లూమింగ్ బహుదీక్షగా ఆపుస్తకం చదువుతున్నాడు. అసలే ఆతడికి దృష్టితక్కువ. దానికితోడు తిండి సరిగ్గాలేక చూపుమరింత చెడింది. అయినాసరే ఆజ్యోతిషరహస్యాలను బయటకు లాగాలనే పట్టుదలతో అరంగుళం దళసరి అద్దాలమీద ఆనించినంత దగ్గరగా పెట్టి చదువుతున్నాడు. విశ్శబ్దంగా

గదిలోకి వచ్చిన లాఓ-ల్యూను చూడగానే అదిరిపడి తాను చదువుతూన్న పుస్తకాన్ని గభీమని డ్రాయరులో పెట్టి దాచేసేడు.

"డిప్యూటీ చైర్మన్ రాకవలన నాకుటీరం పావనం అయింది." అంటూ పెద్దపెద్ద మాటలలో లూమింగ్ తన పాండిత్యాన్ని ప్రకటించాడు. కాని, ఆతని మాటలలో విచారం ద్యోతకం అవుతూనేవుంది. ఏమంటే అసలు డిప్యూటీగా తనను నియమించి వుండవలసిందని ఆతని అభిప్రాయం.

"లూమింగ్! నన్ను డిప్యూటీ చైర్మన్ అని పిలవకు. ఆ వుద్యోగం కావాలంటే చెప్పు. నీకివ్వమనీ, నన్ను వొదిలిపెట్టమనీ సముద్దారుతో చెప్తాను."

లూమింగ్ సమాధానం ఇవ్వలేదు. కాని, ల్యూ మాటలను నమ్మనూ లేదు. అంత అందమైన బిరుదును నిస్సంకోచంగా తోసిపారేసే చవట ప్రపంచంలో వుండడని ఆతని అభిప్రాయం. తన వృత్తి సహజమైన ధోరణిలో లాఓ-ల్యూ ముఖం పరకాయించి చూసేడు. అందులో ఏదో కొత్తదనం ఆతనికి తోచింది. ఆడదానిచేత బోల్తాపడ్డ బ్రహ్మచారిలా కనుబొమ్మలు ముడిపెట్టేడు. దిక్కూ, దివాణంలేని అనాధబాలుడులా పెదవులు బిగించేడు. డిప్యూటీ చైర్మన్ ఏదో గొడవలో పడ్డాడు కాబోలునని లూమింగ్ వూహించేడు. వెంటనే వూళ్ళో తాను విన్నవార్త గుర్తుకువచ్చింది. సామాన్యంగా ఊళ్ళో ఏమాట పుట్టినా లూమింగ్‌కు తెలియకుండా వుండదు. జపాను వాళ్ళకోసం డబ్బు కూరుస్తూన్నవార్త కూడా ఆతని చెవిని పడింది. అందుచేత వెంటనే ఆతురత, భయంచూపే గొంతుకతో "నీ డిప్యూటీ పదవికో దండం, నాకేమీ వద్దు" అనేసేడు.

"జ్యోతిషంలో ఒకకొత్త సిద్ధాంతం తీసుకురావడానికి పనిచేస్తూన్నా. ఆపనే తెమలడంలేదు. ఔనుగాని, డిప్యూటీ చైర్మన్! ఈ విషయం కాస్త వలుగురితో చెప్పాలి. ఇంకముందు యుద్ధాల్నిగురించీ, పంటల్నిగురించీ, వారలేకుండా జోస్యం చెప్పగలను."

"అల్లాగే. కాని, లూమింగ్ ! నీవల్ల అమేపని వొకటుందోయ్ !" అని ల్యూ గొణిగేడు.

"ఆలాగనా ?" అన్నాడేగాని, లూమింగ్ ఆ సంగతేదో గ్రహించేసేడు. అందుచేత మూడు డాలర్లు సమస్య తీసుకురాకుండా సంభాషణ మార్చేడు.

"డిప్యూటీ చైర్మన్! (ఆ పిలుపుకు ల్యూ చాలా ఇదయ్యేడు) గాలి మార్పు వచ్చినప్పుడూ, పరిస్థితులు మార్పు వచ్చినప్పుడూ మనుష్యుల అభిప్రాయాలుకూడా మారడం ఆశ్చర్యం కాదు. యుద్ధాలూ, కల్లోలాలు వచ్చిన సంవత్సరాలలో హఠాత్తుగా వయస్సు గడిచిపోయిన వాళ్ళల్లా అయిపోతాం. నాకు వయస్సు నలభయ్యేనిమిది దాటకపోయినా ముసిలివాడి నయిపోయా ననిపిస్తుంది. బ్రహ్మచారిగాడిని. ఏ పాదరబందీ లేదు గనక హుషారుగా వుండాలి. కాని, నిజం చెప్పాలంటే ఈవేళ నామనస్సులో ఉత్సాహమనేది లేదు. మనమలు, మునిమనమలు ఉంటే దాగుండునవిపించేటంత వయస్సువొచ్చి నట్లనిపిస్తూంది నామనస్సుకి."

"నిజమే, లూమింగ్! ఈ పాటికి నువ్వు పెళ్ళిచేసుకోవలసిందే. నీ వంశానికో అంకురం వుండాలనుకోవడంలో తప్పులేదు. వంశం లేకుండా చేయడంవలన మహాపాపం వస్తుందని భగవానులు కన్ఫ్యూషియసు చెప్పారు. ఇంక మనమలు రావడాన్ని గురించా, ఇంకా పెళ్ళీ, పిల్లలూ లేనిదే, మనమ లెక్కడినుంచి వస్తారు?"

"డిప్యూటి చైర్మన్ సరిగ్గా చెప్పాడు. నువ్వు చెప్పినమాట నాకూ యిష్టమే. కాని, ఒక ఆడదాన్ని, ఆఖరుకి భర్తపోయిన ఏ వయస్సు మళ్ళినదానిని కట్టుకుందామనుకున్నా డబ్బేది ? ఎక్కడినుంచి తేను?"

"ఇంతకాలం నుంచి జ్యోతిషాలు చెబుతూన్నావు, ఆమాత్రం వెనక వెయ్యలేక పోయేవా?"

"ఏష్టి!-ఆఖరుకి మూడు డాలర్లేనా నా జేబులో లేవు." అని లూమింగ్ ఖండితంగా చెప్పేసేడు.

"అయితే కష్టమే." అని ల్యూ ఆలోచనలో పడ్డాడు.

లూమింగ్ మరచిపోయినదేదో జ్ఞాపకానికి వచ్చినట్లు అదిరి పడ్డాడు. "మరిచేపోయేను. ఒకళ్ళతో ఈవేళ వుదయమే వస్తానని చెప్పేను. ఒక వర్తకుడికి జాతకం చూస్తానన్నానులే. వెళ్ళాలి. తప్పదు. డిప్యూటీః మరొకలా అనుకోకు. వెడితే ఇంత అన్నం దొరుకుతుంది. సెలవు. మరి."

లాఓ-ల్యూను తనగుడిసెలో కూర్చోపెట్టి లూమింగ్ చల్లగా వీధిలోకి వెళ్ళిపోయేడు. నిజానికి ఆతడు ఎవ్వరినీ కలుసుకోనక్కర్లేదు. రెండు వారాలనుంచి ఇంట్లో గింజలులేవు. అందుచేత ఇన్ని వెదురాకులూ, ఊరు పేరూ తెలియని ఒకచెట్టు బెరడూ నీళ్ళల్లో వుడికించి అదే త్రాగుతున్నాడు. అది కడుపునొప్పి, విరేచనాలు తెచ్చిపెట్టింది. కొంచెం మంచిగాలి తగులుతుందనీ, దొడ్డికిపోయేపని పూర్తిచేసుకోవచ్చుననీ ఆతడు కొండలమీదికి పోతుంటాడు. ఇప్పుడూ అక్కడికే వెళ్ళేడు.

తలుపు మూసి గొళ్లెంపెట్టి ల్యూ వీధిలోకి వచ్చేసేడు. తలవంచుకొని పెద్ద ఆలోచనలో వున్నట్లు వీధివెంటబడి పోతున్నాడు. అదృష్టరేఖ తనకు ఎదురు తిరిగిందని విచారపడుతున్నాడు. అన్నిచోట్లా ఇల్లాగే వుంటే ఇంక ఆ పని తనవల్ల కాదు. అయినా తప్పదుగా? ఇంకొక్కమారు ప్రయత్నించి చూద్దామనుకున్నాడు. సంసారం బాదరబందీ లేనిమనిషి ఇంక ఊళ్ళోకల్లా ఒక్క మేరోజ్ మిగిలింది. "చిన్నమామ చెప్పినట్లు రోజూ ఒకగుడ్డు తింటూన్నట్లయితే ఆమె పరిస్థితులు బాగున్నట్లే వూహించాలి. మూడు డాలర్లు ఇవ్వగలుగుతుంది." అని ఆలోచిస్తూ ల్యూ మేరోజ్ గుడిసెవేపు దారితీసేడు.

మేరోజ్ ఇంట్లో కనపడలేదు. కాని, గుడిసెకు కొద్దిదూరంలో వున్న కొండరాళ్ళవెనక ఆడుదాని గొంతు వినబడింది. ఏమిటో చూద్దా మనుకుంటూ సరాసరి ఆవేపుకి వెళ్ళేటప్పటికి తన కొడుకు హౌఫాతో మేరోజ్ కుస్తీ పడుతూంది. ఆ పడుచువాడు ఆమెను చేతుల్లో దొరక పుచ్చుకొని, ఆమె ముఖం మీద ముద్దుల వర్షం కురిపిస్తున్నాడు. ఆ ఉద్ధృతానికి హడిలిపోయి ఒకకోడి చెట్టుకొమ్మ ఎక్కి తెగ గొడవచేస్తూంది.

అవినీతికరమని ప్రజలు తలచే అటువంటి పనిని లాఓ-ల్యూ సహించలేకపోయేడు. కోపంతో "ఏంపనిరా అది ?" అని అరచేడు.

ఆ యువకుడు మేరోజ్‌ను విడిచిపెట్టి బహుశాంతంగా "కోడి పెట్టని పట్టుకోవాలి"- అన్నాడు.

"ఆవిడ కోడిపెట్ట నీకెందుకు ?"

"తినడానికి."

తనకెంతో అన్యాయం జరుగుతూన్నట్లు మేరోజ్ "చూసేవా" అంది. "ఆకోడిపెట్టని తినేస్తాడుట. నాబ్రతుకంతా దానితోవుంది. ఇంకా గుడ్లయినా పెట్టడంలేదు. పెట్టేటందుకేనా దానికి నేను పెట్టిన తిండే ముంది ?" ఈ మాటలంటూంటే ఆమె కళ్ళనీళ్ళు తిరిగేయి. "మీహౌఫాకి ఆకలివేస్తూందట. దానిని చంపుతానని కూర్చున్నాడు. నీకొడుకు తినడానికి ఇంట్లో ఏమీలేదటయ్యా! మహాదొడ్డ డిప్యూటీ ఛైర్మనువే."

ల్యూ ఏమీ జబాబు చెప్పలేదు. నిజంగానే ఇంట్లో తినేందుకు ఏమీలేదు. తిండి, ఆకలి పేరు చెప్పేటప్పటికి అతని పేగులు కూడా అరుస్తున్నాయి. డిప్యూటీ ఛైర్మన్ ! ఆ పిల్లపిలుపులో ఎంత వెక్కిరింత వుంది ? కోపం, అభిమానంతో ముసిలిష్టాడు మహా బాధపడ్డాడు. ఏడుపొచ్చింది. కాని, ఆ పెంకిరాలుగాయి ముందు ఏడవడానికి అభిమానం వేసింది. వెల్లగుండాపడి శాంతినిర్వహణ సంఘం ఆఫీసువేపు చకచక వెళ్ళిపోయేడు. "ఈ వెధవబిరుదు, పాడుబిరుదు వదుల్చుకుంటాను." దారిపొడుగునా ఇదే ఆలోచన.

ఆ ఆవేశంలోపోయి ఛైర్మనుకు తన రాజీనామా ఇచ్చెయ్యాలని ఆఫీసులో అడుగు పెట్టేడు.

ఛైర్మన్ కుర్చీలో కూర్చుని టీ చప్పరిస్తున్నాడు ఆర్డర్లీ పట్టి కాళ్ళతో ప్రక్కన నిలబడి అవసరమైతే ఇంకా టీ పొయ్యడానికి సిద్ధంగా వున్నాడు. ఛైర్మన్ తలవొంచుకొని, టీ కప్పులో అడుగునవున్న పచ్చని ఆకులను తదేకదృష్టిగా చూస్తున్నాడు. దూరప్రాచ్యంలో శాంతిస్థాపన భారంఅంతా తనమీదనే వున్నట్లు అతడు ఓక్షణంలో కనుబొమ్మలు కుంచించీ, మరోక్షణంలో చిరునవ్వులతో తల ఆడించీ భావభంగిమలు ప్రదర్శిస్తున్నాడు.

లాంఓ-ల్యూ గదిలో అడుగు పెడుతూనే కర్రవిరిచినట్లు "ఛైర్మన్ గారు! ఇంక ఈపని నావల్ల కాదు" అనేసేడు.

ఆమాట తాను వినన్నట్లు నటిస్తూ "ఏమిటన్నావు?" అన్నాడు ఛైర్మను.

"తన మూడుడాలర్లు చిన్నమామ ఇవ్వలేదు. జూమింగ్ ఇవ్వ లేదు. ఆఖరుకి మేజోజ్ కూడా ఇవ్వలేదు."

"ఏమిటది మళ్ళీచెప్పు."

"నేను డబ్బు వసూలు చెయ్యలేను. చివరకు నామట్టుకినేను ఒక్క కాని ఇవ్వలేను. నేను రాజీనామా ఇచ్చేస్తాను."

"ఎందుకివ్వవో చూస్తా" నని ఛైర్మన్ గర్జించేడు. "జపాను వాళ్ళతో చెప్తే వాళ్ళే వసూలుచేస్తారు" అని బలంకొద్దీ బల్లమీద గుద్దే టప్పటికి, ఆ అదురుకి బల్లమీదికప్పు ఎగిరి నేలనిబడి ముక్కలు ముక్క లయిపోయింది. అంత అందమైన చీనాకప్పు బద్దలయిపోయినందుకు విచారం, కోపంగలిగి పెద్దపులిలాగ అరిచి బల్లమీద గుద్దడం ప్రారంభిం చేడు. "జపానువాళ్ళతో చెప్తే వాళ్ళే వసూలు చేస్తారు."

మొదటికేకకే ల్యూ ప్రాణాలు ఎగిరిపోయేయి. ఒక్క గంతువేసి వీధిలోపడి ల్యూ క్షణంలో అదృశ్యం అయిపోయేడు.

ఈ విధంగా తాను తలపెట్టిన మొట్టమొదటి పని కాస్తా భగ్నం అవడంతోనే ఏంచెయ్యాలో జమీందారునీ, మీసాల జపానువాడినీ కను క్కోడానికి ఛైర్మన్ పట్టణం బయలుదేరేడు. శాంతి నిర్వహణ సంఘం ఏర్పడ్డాక జమీందారు హూఆ మళ్లీ పట్టణం వెళ్ళిపోయేడు. యుద్ధం ముగిసేవరకు ఆతడు అక్కడే వుండదలచేడు. శాంతిభద్రతలు సుస్థి రంగా నెలకొల్పబడేవరకూ ఆతడు తనవూళ్ళో మకాం పెట్టదలచుకో లేదు. భూమి ఎక్కడికి పోతుంది? దేశం అంతటా వ్యాపించివున్న అశాంతి చూసేక, ఆతనికి నిద్ర కరువయింది. జపానువాళ్లున్న పట్టణంలో అయితే జీవితానికి కొంత నిలకడేనా వుంటుంది.

పట్టణంలో హూఆ వున్నయిల్లు పెద్ద భవనం. ఛైర్మన్ వొగుర్చు కుంటూ వెళ్లేటప్పటికి జమీందారూ, జపాను సలహాదారూ కూడా అక్కడే వున్నారు. వాళ్లిద్దరూ ఒకేచోట వుండడం చూసేటప్పటికి ఆతనికి ప్రాణాలు కుదుటపడ్డాయి. వారినీ, వీరినీ పిలుచుకురావలసినగొడవ తగ్గింది. సరాసరి తానుకూడా వాళ్ళ ప్రక్కనచేరి చర్చల్లో పాల్గోవచ్చును. కాని, ఒక్కనిముషం వారి సంభాషణ విన్నాక వెంటనే తానాచర్చల్లో పాల్గో వడం పొరపాటని నిశ్చయించుకొని ఒకప్రక్క నిలబడ్డాడు.

వారిద్దరూ చర్చిస్తూన్నది ఆశియాజాతుల అభివృద్ధిని గురించి కాదు. ఆడవాళ్ళు- ఆహారం అనే విషయాలమీద వారి చర్చ సాగుతూంది. జపాను సలహాదారు చైనాలో అడుగు పెట్టినరోజునే చైనావాళ్ళ ఆహారం చాలా రుచిగా వుంటుందని కనిపెట్టేడు. దేశభక్తికి వ్యతిరేకమే అయినా సరేనని చైనా భోజనంతప్ప చేయడమే మానేసేడు. ఆఖరుకి తనయింట్లో చీనాపద్ధతినే వంట సాగించడానికి నిశ్చయించి ఒక చీనావానిని వంటకు పెట్టుకున్నానన్నాడు. కాని, ఆచీనావాడు తనదేశం యందుగల భక్తి

వల్లనో, లేక రెండేరెండు డాలర్ల జీతం ఇస్తూన్నా చాలదనో చీనావాళ్ళ వంటలా బాగా చెయ్యడంలేదు. ఉరితీసేస్తానని బెదిరించినా, ఒక్కనాడు కూడా నోటబెట్టుకొనేందుకు వీలయిన పదార్థం ఒక్కటీ తయారుచెయ్య లేదు. తాను ఎప్పుడూ వంటచెయ్యనేలేదనీ, జపాను సైనికులు వీధె పోతూన్న తన్ను 'రిక్విజిషన్' చేసేసేరనీ అంటాడు. ఇదేమంటే "పోనీయని వండిపడేస్తూంటే బాగులేదనే టట్లయితే నే పోతా" నని కూర్చున్నాడు. సలహాదారు ఒకరోజున హూఆ ఇచ్చిన విందు భోజనం అత్యద్భుతంగా వుందని గుర్తించాడు. ఆనాటినుంచీ పిలిచినా, పిలవకపోయినా ఏదోకారణం వలన హూఆకి అతిధిగానే వుంటున్నాడు. ఒక్కపూటకూడా తప్పకుండా భోజనాలవేళకు ఆతను అక్కడ సిద్ధంగా వుంటాడు. దానివలన రెండులాభాలు. వంటవాడిబాధ వొదలడం వొకటి. తనయింటి జమాఖర్చు లెక్కలుతప్పితే కాలం అంతా దూరప్రాచ్య దేశాల శాంతిభద్రతలకోసమే ఖర్చుపెట్టగలడు. ఇది రెండోది. అందుచేత పరిచయంబాగా వృద్ధిచేసుకొని ఇంట్లోవాడుగా చలామణీ అయ్యేటం దుకై భోజనంకాగానే గంటో, రెండుగంటలో బాతాఖానీ నడిపిస్తాడు. మొదట్లో ఈచర్చ బోల్షివిజాన్ని నిర్మూలించడం, ఆంగ్లేయుల్నీ-అమెరిక నుల్నీ ఆశియానుంచి తరిమివెయ్యడం వంటి కఠోర సమస్యలమీదనే సాగేది. కాని, త్వరలోనే అవన్నీ మూలబడి ఆడవాళ్ళమీదనే చర్చలు కేంద్రీకరించేయి. ఈ విషయంలో కూడా జపాను సలహారుకి చైనాస్త్రీల మీదనే సదభిప్రాయం ఏర్పడింది. ముఖ్యంగా మేరోజ్‌ను ఆతడు మరిచి పోలేకుండా వున్నాడు.

"హూఆ! ఊళ్ళో ప్రజలతో స్నేహం శాశ్వతంగా ఏర్పరచుకోవా లనే కాకపోతే మేరోజ్‌ని అసలు వదిలిపెట్టేవాడినా?" అని జపాను సలహాదారు చెప్పి, విచారంతో ఒక్క నిట్టూర్పు విడిచేడు.

చైర్మన్ ఇంతసేపూ నిలువుకాళ్ళమీదే వున్నాడు. ఈ భోజనా నంతర సంభాషణ ఎంతకీ తెమిలేలాగ కనబడక పోయేసరికి,

ఏమయినా సరేనని తెగించి, ఇద్దరికీ నమస్కారం చేసేడు. గొంతుక సవిరించుకొని, బహుగంభీరంగా తాను వచ్చినపని చెప్పడానికి ప్రారంభించేడు.

"మీ పాదదాసుణ్ణి. మాటలకు అడ్డం వస్తున్నానని అనుకోవద్దు. తమకు చెప్పుకుతీరవలసిన పని వొచ్చిపడింది. అందుకే వచ్చేను."

"ఏమిటది?" అని హుటాఆ ఆశ్చర్యంతో అడిగేడు.

"వూరివాళ్ళనుంచి నూరుడాలర్లు వసూలు చెయ్యాలని తమరు ఇద్దరూకూడా నాకు ఆజ్ఞ యిచ్చేరు. ఆ ప్రకారమే నేను వూళ్ళోకి వెళ్ళినప్పటినుంచీ ఆ పనిమీదనే వున్నాను. కాని, ఎవ్వళ్ళూ ఇవ్వడంలేదు. చిన్నమామ, లూమింగులాంటి బ్రహ్మచారిగాళ్ళుకూడా ఇవ్వడంలేదు. లాఓ-ల్యూ చిన్న మెత్తు పనికూడా చేయలేకపోయేడు. నేనొక్కణ్ణీ ఏం చెయ్యగలుగుతాను. జపానుచక్రవర్తుల నూతన వ్యవస్థను స్థాపించడంలో నాకు ఎంతో వుత్సాహం వున్నా ఏం చేస్తాను? ఎవరినేనా నాకన్న సమర్థుణ్ణి పెట్టండి. నేను తప్పుకుంటాను."

జపాను సలహాదారుడికి మహాచెడ్డకోపం వచ్చింది. ఈ గ్రామస్థులతో స్నేహం కోసమని కాకపోతే మేరోజ్‌ని వదులుకొని వుండేవాడే కాదు! తాను అంత త్యాగం చేసినప్పుడు ఆగ్రామస్థులు దాని గుర్తించకుండా కృతఘ్నులుగా వ్యవహరించడం ఆతనికి ఎంతో కష్టం కలిగించింది.

"వద్దు. నీలోపం ఏమీలేదు. ఆ దొంగవెధవలు వాఆజ్ఞల్ని ఎల్లాగ మీరగలరో చూస్తాను." అంటూ పిడికిలి బిగించి బల్లమీద ఒక్కగుద్దు గుద్దేడు. ఆవేశం వచ్చినప్పుడు అల్లా గుద్దడం ఆతనికి అలవాటు. ఆ గుద్దుకి బల్లమీదవున్న టీ కప్పులూ అవీ క్రిందికి దొర్లిపోక పోయినా ఎగిరి పడ్డాయి.

హుంఆ పై ప్రాణాలు పైనే పోయేయి. జపానువాళ్ళకి కోపం వచ్చినప్పుడు ఎదటున్నవాడు మిత్రుడైనా సరే, శత్రువయినా సరే ఒళ్ళుతెలియని శివాలతో తమ పరాక్రమం అంతా వాళ్ళమీద ప్రదర్శిస్తారు. అందుకే ఆ జపానువాడి మొలమున్న కత్తిమీద ఎప్పుడూ ఒక్కకన్ను వేసే వుంచుతున్నాడు, హుంఆ. కాళ్ళు మరీ పొట్టివికావడం వలన మొలలోని కత్తి కాళ్ల కడ్డబడుతూ నడిచేటప్పుడు బాధ కలిగిస్తూన్నా జపాను సలహాదారుడు ఆ కత్తిని ఒక్క నిముషంకూడా వదిలిపెట్టడు. మంచూరియాకు, కొరియాకు నడుమనున్న చంగ్-కు-ఫెంగ్ కొండవద్ద 1938 లో సోవియటు సైనికులతో జరిగిన 'సంఘర్షణ' లో తాను ఇద్దరు రెడార్మీ వాళ్ళని చంపేడట. ఆ పరాక్రమానికి మెచ్చి, చక్రవర్తి స్వయంగా ఆ కత్తిని తనకు బహుమతి యిచ్చేడట. బోల్షివిక్కులమీద ప్రయోగించినట్లే దానిని తనమీదా ప్రయోగిస్తాడేమోనని హుంఆ అను కొని ఆపాదశిరఃపర్యంతం వొణికిపోయేడు.

"అంత ఉద్రేకపడవద్దు. నేను మావాళ్ళ స్వభావం బాగా ఎరుగుదును. వాళ్ళతో ఎల్లా వ్యవహరించాలో ఎరుగుదును. మీరు శాంతించండి. తొందరపడకండి." అని శాంతిపరచసాగేడు.

కుడిచేతితో కత్తిని గట్టిగా పట్టుకొని జపాను సలహాదారు "వాళ్ళని ఏంచెయ్యాలో చెప్పు" అని గదమాయించేడు.

"అధికారం గలవాళ్ళని మా రైతులు చాలా గౌరవిస్తారు. మన ఛైర్మన్‌కు వెనక కొందరు సైనికుల మద్దతు ఇచ్చివుంటే మొదటనే అన్నీ సక్రమంగా జరిగి వుండేవి. ఏమంటావు, హాంగ్-మీః" అని తన సముద్దారువేపు తిరిగి ప్రశ్నించేడు.

"సందేహంలేదు. తమరు అసలు విషయం కనిపెట్టేరు." అని ఆతడు జమీందారుని ప్రోత్సహించేడు.

హుంఆ ఆ మాటలకు ఉప్పొంగి జపానువాడికి సలహా యిచ్చేడు.

"మీరు కొందరు సైనికుల్ని చైర్మన్ వెంట ఒకటిరెండు వారాల పాటు వుంచండి. వాళ్ళసాయంతో అన్నిపనులూ పూర్తవుతాయి. ఔను గాని, మేరోజ్‌కూడా మూడు డాలర్లు ఇవ్వనందిటోయ్?"—అంటూ సముద్దారుకు కన్ను గిలిపేడు.

"ఆవిడ అంతే, తాను అందమైనది గనక గ్రామానికి సంబంధించిన వ్యవహారాల బాధ్యత తనకు లేదని ఆవిడ అభిప్రాయం అనుకుంటాను. అయితేనేం కాని, ఇదివరకటికన్న ఆమె యిప్పుడు చాలా బాగుందండి."

"ఆ లంజకి కూడా పొగరుబలిసిందా?" అని సబహాదారు కోపంతోను, ఆవేశంతోను అరిచేడు. "హూఆ! నువ్వు చెప్పింది మంచిదే. కొంతమంది సైనికుల్ని తీసుకెళ్ళి కొన్నిరోజులు అక్కడ మకాం పెడతాను."

"అదేమంచిపని!" అని జమీందారు అభినందించేడు. జపాను సబహాదారు నెమ్మదిగా శాంతించి, కత్తిమీదిచెయ్యి తీసేడు. హూఆ ప్రాణం కుదుటపడింది.

నిజంగా ఇన్నాళ్ళకూ ఈవేళ హూఆకు ఆనందం కలిగింది. కొన్ని రోజులపాటేనా విస్తరివద్ద వీడి పోరుండదు. అన్నిటికన్నా ముఖ్యం మంచి నడియౌవనంలోవున్న తన రెండోపెళ్ళాన్ని గురించి కొన్నాళ్ళపాటు నిశ్చింతగా వుండొచ్చు. ఈమధ్యని జపాను సబహాదారు తరుచుగా తన యింట్లోనే మకాంపెట్టి ఆవిడమీద కన్నువేస్తున్నాడు. ఇంక కొన్నాళ్ళపాటు వాడి బాధవుండదు.

౬

రెండు రైఫిళ్లు, ఒకచిన్న తేలిక మెషిన్‌గన్ తీసుకొని ముగ్గురు సైనికులతో జపాను సలహాదారు హాంగ్-మీ వెంట వాళ్ళవూరికి బయలు దేరేడు. హూఅ సలహా ఇవ్వకపోయినా ఆతడు పల్లెటూళ్ళలో కొంత కాలం మకాం చెయ్యాలిసి వుంటుందని అనుకుంటూనే వున్నాడు. ఆక్రమిత చైనాలో సైన్యాలు సులువుగా తిరగడానికి అనువు చిక్కేటందుకై జపాను మిలిటరీ అధికారులు రోడ్లు వెయ్యడానికి ఒకపథకం తయారు చేసేరు. చైర్మన్‌వున్న ఊరు ప్రక్కనుంచి ఒక చిన్నరోడ్డు పడాలి. దేశంలో సాధ్యమైనంత త్వరగా శాంతిభద్రతలను ఏర్పరచ వలసిన అవసరం వుండడంచేత రోడ్ల పనులన్నీ అతి స్వల్పకాలంలో ముగియవలసి వుంది. పల్లెటూళ్ళమీదపడి, చాపగొట్టి పని చేయించేటందుకు ఇది సాకుగా జపాను సలహాదారుకు ఉపయోగపడింది. అంతే.

ఊళ్ళోకి వస్తూనే వారు మీటింగుకి చాటింపువేయించేరు. జేగంట జబ్బలు నెప్పులుపట్టేలాగ వాయిస్తూ గుండెలుఆర్పుకుపోయేలాగఅరుస్తూ ఆర్డర్లీ ఆక్యూ ఆరోజు మధ్యాహ్నం అంతా తిరుగుతూనే వున్నాడు. మొదటి మీటింగురోజున జపానువాడి కేకలకు హడలిపోయి లాఓ-ల్యూ భార్య చనిపోవడం చూసేరుగనుక ఈమారు మీటింగుకి యెంతోమంది రాలేదు. ముసలివాళ్ళు అసలు ఆ చాయలకే రాలేదు. డిప్యూటీ చైర్మన్ లాఓ-ల్యూ యే చలిజ్వరం వొచ్చినవాడిలా విలువెల్ల వొణికిపోతున్నాడు. ఊళ్ళో పడుచువాళ్ళు కొండలమీదకి పారిపోవాలని బయలుదేరేరు. కాని తీరా ఊరుచివరకి వెళ్ళేటప్పటికి తేలిక మిషన్‌గన్ రెడీచేసుకుని కూర్చున్న ఇద్దరు జపాను సైనికులు కనబడేటప్పటికి వెనక్కి తిరగక తప్పిందికాదు. మందతప్పిన మేకల్ని తిరగేసుకొచ్చినట్లు జపానువాళ్ళు అందరినీ గుళ్ళోకి నెట్టుకొచ్చేరు.

శాంతి నిర్వహణసంఘ కార్యాలయం చావిడి జనంతో నిండిపో యింది. నోళ్లు తెరుచుకుని, భయంతో పెర్రివాళ్ళల్లాగ ఒకరి మొగాలు ఒకరు చూసుకుంటూ గ్రామస్థులంతా చతికిలబడ్డారు. వేదికమీద చైర్మనూ, జపాను సలహాదారూ తోడుదొంగల్లా ఒకరిప్రక్క ఒకరు నిలబడ్డారు. చైర్మన్ ఈమధ్య బాగా లావుబారినా పొడుగ్గా కనిపిస్తూ న్నాడు. జపానువాడు గుండ్రంగా, కొనదేలిన మిలిటరీటోపీ పెట్టుకొని ముళ్ళపందిలా కనబడుతున్నాడు. వాళ్ళిద్దరూ ఒకచోట నిలబడడం నవ్వుపుట్టిస్తూన్నా, ఎప్పుడూ హాస్యం ఆడుకునే గ్రామస్థుల బుర్రలలో ఆరోజున ఆ గిలిగింత కలుగనేలేదు. ముందు ఏంవొచ్చి పడుతుందోననే అందరి భయమూ.

ప్రజలునలుగురూ చేరగానే జపాను సలహాదారు, గ్రామస్థు లంద రికీ ఎంతకాలంనుంచో పరిచయమైనవాడిలాగ విసవిస వేదిక ముందుకు వచ్చేడు. మీసాలూ, పెదవులూ తుకతుక కదుపుతూ ఒక్కక్షణం సభ కుల్ని పరికించిన తర్వాత గ్రాంధిక బాషలో ఉపన్యాసం ఆరంభించాడు :

"నా ప్రియమైన సోదరులారా!...."

ఆ మాట అని ఒక్కమారు సభఅంతా కలయచూసేడు. ఆ బంధు సంబోధనకి తేలుకుట్టినట్లుగా అయి సభఅంతా అదిరిపడ్డారు. వెంటనే గుమ్మంలోనిలబడ్డ జపానుసైనికులు రైఫిళ్ళు భుజాల కెత్తుకొని, గుర్రాలమీద వ్రేళ్లపెట్టి సిద్ధంగా నిలబడ్డారు. వారివేపు చూడగానే జనం మళ్ళీ సర్దుకొని కూర్చున్నారు. వాళ్ళ వోపికకు, శాంతానికీ సంతృప్తి పొంది జపాను సలహాదారు తన వుపన్యాసం సాగించేడు :

"క్రిందటిమారు మిమ్మల్ని చూసినప్పటినుండీ నాకు మిమ్మల్ని గురించే ధ్యాసగా వుంటూంది. 'మిమ్మల్ని గురించి ఆలోచిస్తూనే నేను ముసిలివాడనై పోయే'నని భగవాన్ కన్ఫ్యూషియసు చెప్పింది రత్నం లాటి మాట. ఇంకోతమాషా ఏమిటంటే, మనం అందరం ఒక్క

'మికాడో' (జపాన్ చక్రవర్తి) పాలితులమేగాక ఒకరికొకరం సోదరులంకూడా అనిపిస్తూంటుంది. కొరియన్లలా కాకుండా మీరంటే ఎందుకో నాకు మైత్రిఅభిమానం కలుగుతూంది. బహుశా మీరుకూడా నా విషయంలో అటువంటిభావాలే కలిగియుంటారు. కాని, అటువంటి భావాలు కేవలం మనస్సులో వుంచుకుంటే లాభంలేదు. వాటిని కార్యరూపంలోకి తెస్తేనే అవి చిరకాలం మనగలుగుతాయి"

సభలోనివారంతా గుమ్మంలో నిలబడ్డ జపాన్ సైనికుల తుపాకుల వేపు చూసి, మళ్ళీ తలలు తిప్పుకున్నారు.

ఒక చిన్నదగ్గు దగ్గి, జపాను సలహాదారు మళ్ళీప్రారంభించేడు :

"కాని, ఒక్కవిషయం చెప్పాలి. మీరెవ్వరూ ఈ సంగతిని గ్రహించనేలేదని చెప్పాలి. అల్లాగేకనక దానిని వొదిలిపెట్టేస్తే మన యిద్దరికీకూడా అది నష్టమే మనకి సౌఖ్యమే వుండదు. శాంతి నిర్వాహణ సంఘం చైర్మను వోగుచెయ్యాలనుకున్న సొమ్మును ఇవ్వడానికి మీలో కొందరు అంగీకరించనట్లు తెలిసింది. కానైతే ఇది చిన్న విషయమే. కాని, ఛైర్మనునీ, సామ్రాజ్య సైన్యాలనీ తిరస్కరించినట్లే అర్థం అవుతుంది. వాళ్ళు ఎన్నోశ్రమలకు ఓర్చి తూర్పు ఆసియాలో శాంతినీ, సమృద్ధినీ నిర్మించడానికై కష్టపడుతూన్నప్పుడు వాళ్ళకి సాయపడడం మీ బాధ్యత. కన్ఫ్యూషియస్ చెప్పినట్లు అయిందేదో అయింది. మా సామ్రాజ్యసైన్యం చాలా ఔదార్యం గలది. తెగేదాకా తెంపేరకం కాదు. సరే ఇంక ఆ సంగతిని తడవొద్దు. కాని, ఇకముందు అట్లాంటివి జరగకూడదు. ఒక గ్రీకు సైనికనిపుణుడు చెప్పినట్లు మనలో 'ట్రోజన్' గుర్రాలు వుండగూడదు. అందుచేత అటువంటి పద్ధతులు మన క్షేమంకోసమే సాగనివ్వం." అంటూ ఆతడు సభవేపు తిరిగి చూసేడు. కాని, వాళ్ళు ఏమాత్రమూ కదలిక చూపలేదు.

పగటివేషగాడినో, గారడీవాడినో పిల్లలు చూసినట్లుగా గ్రామస్థులు

జపాను సలహాదారుపంక చూస్తూకూర్చున్నారు. వాళ్లు అనేక రంగుల గుర్రాలను గురించీ, అనేకజాతుల గుర్రాలను గురించీ విన్నారుగాని ట్రోజన్ గుర్రాన్ని గురించి ఎప్పుడూ వినలేదు. జపానుసామ్రాజ్య సైనికుల్ని కలుసుకొన్నప్పుడు తప్పుగా శాల్యూట్ చేసి తన్నులు తినకుండా వుండేందుకై ఛైర్మన్ ఈమధ్య "సోల్జర్సు మాన్యుయల్" కంఠోపాఠం చేస్తూన్నాడు. ఆతడు ఈ కొత్తశబ్దం ఏదో మిలిటరీ పారిభాషిక పదం అనుకుని, మిలిటరీ విషయాలలో సలహాదారుకుగల అనంతజ్ఞానానికి ఆశ్చర్యపడ్డాడు. కాని అమాయిక ప్రజలకు విదేశీయాసతో పలికిన ఆ శబ్దం దయ్యాలుపెట్టడానికి చదివే మంత్రంలా వినబడింది. దానితో సభలో కూర్చున్నవాళ్ళు కూర్చున్నట్లే వొణకడం ప్రారంభించేరు. అట్లాంటి సమయాల్లో దెయ్యాలంటే భయంలేనట్లు సూచించేటందుకై ఒక్కమారు చిరునవ్వు నవ్వితే దెయ్యమే భయపడి పారిపోతుందని పల్లెటూరివాళ్ళ నమ్మకం. ఆ నమ్మకంకొద్దీ అందరూ చిరునవ్వు నవ్వసాగేరు. ఇటువంటి విషయాలలో బాగా అనుభవంవున్న బామింగు మొదట నవ్వేడు. మిగతా అందరూ అతనిని అనుకరించారు.

అందరి మొగాలమీదా నవ్వుచూసి జపాను సలహాదారు "పాచిక పారిం"దనుకున్నాడు.

"చాలా బాగుంది. మన 'మికాడో'యే ఇక్కడవుంటే కొరియన్లకంటె మిమ్మల్నే బాగా మెచ్చుకుంటాడని నా నమ్మకం. స్నేహభావాన్ని చూపినందుకు మీ అందరినీ అభినందిస్తూన్నా. ఔనా మరి. ఇప్పుడొక బ్రహ్మాండమైన పని చెయ్యవలసివుంది. మనం ఒకరి ఊళ్ళకు ఇంకొకరు తరుచుగా, సులువుగా వస్తూ పోతూ స్నేహంగా వుండాలంటే మనం రోడ్లు వేసుకోవాలి. ఇప్పుడు శీతాకాలం వచ్చింది. పొలాల్లో పనులేవీ వుండవు. అందుచేత రాండి రోడ్లు వోద్దాం. పైగా పనిచేస్తే ఒళ్ళు వేడెక్కుతుంది. చలికి కొయ్యబారే రోజుల్లో అది చాలా మంచి

పరిశ్రమ. నేను ఆఫీసుపనులు చెయ్యనక్కర్లేకుంటే నిజంగా మీ అంద రితోవచ్చి పనిలో పాల్గొనాలనే వుంది."

"అదిగో చూసేవా, డిప్యూటీ ఛైర్మన్!" అని చిన్నమామ ల్యూను డొక్కలో పొడిచాడు.

"అయితే తిండిమాటేమిటి?" అని మేరోజ్ లేచి నిలబడి అడి గింది. ఆమెకు సలహాదారంటే భయంలేదు. జపానువాళ్ళు ఆమెను ఎత్తుకుపోయినప్పుడు ఆమెను సలహాదారుయింట్లో దాసీగా పని చేయిం చేరు. అప్పుడు ఆమెకు వాడు 'పరిచయం' అయాడు.

"మాకు ఇన్ని బియ్యము, రోజుకి ఒక అరడాలరన్నా జీతము ఇస్తారా?"

సలహాదారుకు కోపంవచ్చి, చర్రున తిరిగి చూసాడు. కాని, అడిగిన మనిషి మేరోజ్ కనక వెంటనే మెత్తపడ్డాడు. శీతాకాలం తిండి లేక పిల్ల చిక్కింది. అయితేనేం ఆ పెద్దపెద్ద కళ్లు, పల్చని ముఖంతో వెనకటికన్న ఆకర్షకంగా వుంది. ఆమెకోసం లొట్టలువేస్తూన్న జపాను సలహాదారు శృంగారభావాలు ప్రదర్శించసాగేడు. పిల్లి "మ్యావ్"మన్న ట్లుగా బహుసరళంగా వస్తూంది, ఇప్పుడు అతనిమాట. "ఛైర్మన్ ఆ ప్రశ్నకి సమాధానం ఇస్తాడు. కాని, నువ్వు రోడ్డుపనిలోకి వెళ్ళవలసి వుండదని నా అభిప్రాయం. ఊఁ....." ఇంకొకటి రెండుమాటలు చెప్పి హాంగ్-మీవంక తిరిగేడు. "ఛైర్మన్! ఇది మీ స్థానిక పరిపాలనకు సంబంధించిన విషయం. ఆ ప్రశ్నకు నాకన్న నువ్వే బాగా సమాధానం ఇవ్వగలవు." అంటూ ఆతడు తనచోట్లో కూర్చున్నాడు. ఆతని కళ్ళు మేరోజ్ మీదనే వున్నాయి.

ఛైర్మన్ లేచేడు. జపాను సలహాదారుకి ఒక నమస్కారంచేసి ఉపన్యాసం ప్రారంభించేడు. "నాకు ఉపన్యాసాలివ్వడం చేతకాదు. నేను యోగ్యుడిని. నా నోట అయోగ్యమైన మాటలు రానేరావు. ఈపని అంతా

ధర్మయుద్ధంకోసమే గనక ఎవ్వరికీ అన్నంపెట్టడం వుండదు. అంచేత జీతాలు ఒకరు యివ్వడమనేదేమిటి? ఇంక ప్రశ్నలు వెయ్యకూడదు. విన్నారా? మీటింగు అయిపోయింది. వెళ్ళండి."

ఛైర్మన్ సభాసదులకు ఒక్క నమస్కారంచేసి, ఎవరేనా చప్పట్లు కొడతారేమోనని ఒక్కనిముషం నిలబడ్డాడు. కాని, ఎవ్వరూ ఆపని చెయ్యకపోవడంచేత నిరాశుడై వెనక్కి వెళ్ళిపోయేడు.

ప్రజల్ని వెళ్ళిపోనివ్వండని గుమ్మంలోవున్న సైనికులకు జపాను సలహాదారు సంజ్ఞ చేసేడు. మరేమీ ప్రమాదాలు జరగకుండా గ్రామస్థులంతా క్షేమంగా వెళ్ళగలుగుతూ న్నందుకు భగవంతుని మెచ్చుకుంటూ లాఓ-ట్యూ అందరితోపాటు తానూ వెళ్ళిపోయేడు.



## ౨

ఆరోజు మొదలుకొని జపాను సలహాదారు, ఆతని సైనికులు గ్రామంలోనే మకాంపెట్టేరు. రోడ్డుపని చేయిస్తూ, గ్రామంలో శాంతి భద్రతలు చెడకుండా సంరక్షిస్తున్నారు. హాంఅ జమీందారు భవనంలో వాళ్ళ మకాము. అక్కడే వాళ్ళ ఆఫీసుకూడా పెట్టుకున్నారు. ఇంచుమించు జపాను సైనికులుకూడా "సలహాదార్ల"లాంటివాళ్లే గనుకనూ, "విశాల ఆసియా" నిర్మాణంలో ఇంతకాలం విశేష శ్రమ పడడంచేతను వారు ఈ గ్రామంలో విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆఫీసువద్ద "గార్డు" అనేది కేవలం క్రమశిక్షణ కోసమే గాని అంతగా అవసరం లేదుగనక ఆ పని ఆకూ్యకి వొప్పచెప్పేరు. ఈ వెర్రివాడు రాత్రి పగలూ అనకుండా ఒక పాత తుపాకి భుజాన వేసుకుని గుమ్మంవద్దనే నిలబడుతున్నాడు. వాడికి రెండుపూటలా, కడుపునిండా తిండైనా వుండదు. తిండికేనా

"రిలీవు" చేయడం వుండదు. ఎల్లాపట్టుకోవాలోకూడా తెలియని మొద్దు లాంటి పాత తుపాకిని మొయ్యలేక మొయ్యలేక భుజాన పెట్టుకుని అల్లాగే నిలబడుతున్నాడు. అదృష్టవశాత్తూ రాత్రులు తలుపులు బిడాయించి, తాళాలు వేసుకుంటారు గనక "సోల్జర్సు మాన్యుయలు"లో చెప్పినమాదిరిగా నిల్చోవలసిన బాధ తప్పుతూంది. ఏ గోడకో జేరబడి నిద్రపోయినా ఎవ్వరూ అడగరు.

చీనా-జపాను జాతుల ఐకమత్యానికి చిహ్నంగా వుండేటట్లు "మేరోజ్"ను "కమాండీర్"చేసి జపానువాళ్లు దాసీగా పెట్టుకున్నారు. స్థానికాధికారి హోదాలో ఛైర్మన్, 'జపాను సలహాదారు' సలహా ప్రకారమే 'కమాండీర్'చేయడం జరిగింది గనక దానిని చట్టవిరుద్ధం అనలేము. ఆమె తనచేత దాసీపని చేయిస్తారనే అనుకొంది. బట్టలు వుతకడం, ఇళ్లు తుడవడం, పాకీదొడ్డి తుడవడం నాకసహ్యం నేను రానుపొమ్మంది. బెదిరింపులు పనిచెయ్యకపోతే చావగొట్టేరు. చేతులకు తాడుకట్టి దూలానికి కోదండం తీయించేరు. దానితో హడలిపోయి మేరోజ్ రాక తప్పిందికాదు. మూతి ముడుచుకొని కూర్చోకుండా అసలుసంగతి చెప్తే ఆనందంతో వొప్పుకుంటుందని ఛైర్మన్ "నీచేత పనేమీ చేయించరులే. కాని, రాత్రిళ్లుమాత్రం ఇంట్లో వుంటూండు. 'సలహాదారుగారు' నిన్ను బాగానే చూస్తారు" అని ఓదార్చేడు. తను చేయవలసిన పనిస్వభావం ఏమిటో ఆమెకిప్పుడు అర్థం అయింది. అసహ్యపడింది. ఏడుపువచ్చింది. పట్టణం లాక్కుపోయినప్పుడు ఆమెకు అనుభవం వుందిగా? ఒళ్ళంతా బొచ్చూ వాళ్లూ కొండముచ్చుల్లా వుంటారు. పొట్టిగా, లావుగా, అసహ్యంగా వుంటారు. వీళ్ళదగ్గిర పడుకోవడం పేరువెబితేనే ఆమె వొణికిపోయింది.

# ౮

దానంతటది రావలసివచ్చిందో, లేక గ్రామస్థు లనుకునేటట్లుగా జపానువాళ్ళుండడం వలన పట్టుకున్న శనో గాని, సలహాదారూ, ఆతని సైనికులూ ఊళ్ళో మకాంపెట్టిన నాటినుంచీ ఈదురుగాలి ఒక్కలా వీస్తూంది. రాత్రీ, పగలూ సుడిగాలి చంపేస్తూంది. ఇంటిమీదనున్న నాలుగు ఆకులూ ఎగరకొట్టేసి ప్రజల్ని చలికి కొంకరించుకు చచ్చిపోయేటట్లు చేయడానికే వచ్చినట్లు కనబడింది ఈ అకాలపు తుపాను. కరుగుతూ కరుగుతూన్న మంచు మళ్ళీ బిగిసిపోయి, రాయిలా అయిపోయింది.

తమదగ్గరున్న చిన్న పలుగులు, పారలతో రాయిలాగవున్న ఈ నేల తవ్వి సన్నగా రోడ్డువెయ్యాలి. ఈ రోడ్డు గ్యాంగుకి డిప్యూటీ చైర్మన్ లాఓ-ల్యూను మేస్త్రీగా నియమించారు. మొట్టమొదట్లో నేనీ వుద్యోగం చెయ్యనని ఆతడు నిరాకరించాడు. కాని, చైర్మన్ వచ్చి 'ఖబడ్దార్' అన్నాడు. మొట్టమొదట చెప్పినట్లుగా డబ్బు వసూలుచెయ్యనందుకు అసలు బహిరంగశిక్ష పొందవలసినవాడేననీ, ఇప్పుడు గనక ఈమాత్రం పనికూడా చెయ్యకపోతే ఇంక క్షమించడం వుండదనీ ఖచ్చితంగా చెప్పేసేడు. పైగా జపానువాళ్ళు ఊళ్ళోనే వుండడంచేత శిక్ష అమలుజరగడానికి కూడా అట్టే ఆలస్యం, శ్రమా వుండదని చెప్పేసేడు. ల్యూ ఎంతోసేపు ఆలోచించేడు. మథనపడ్డాడు. చిట్టచివరకు ఒక్క నిట్టూర్పు విడిచి, తన హోదాకు చిహ్నంగా ఇచ్చిన పొడుగుపాటి కొరడా చైర్మను చేతులనుంచి తీసుకున్నాడు. అప్పటినుంచీ వెర్రివాడిలా చేతిలో కొరడా తీసుకుని, రాయిలా బిగిసిపోయిన మంచుపొరని పగలకొట్టలేక తన్నుకుంటూన్న తనవూరి వాళ్ళను అజమాయిషీ చేస్తూ నిలబడుతున్నాడు.

అంతవరకు ఒక మంచుముక్కని పెల్లగించడానికి తాపత్రయ పడుతూన్న చిన్నమామ పనిమాని ల్యూ వద్దకు వచ్చేడు. "అన్నా! కొంచెం ఆ కొండచాటుకి దొడ్డికిపోయి వస్తాను. ఏంచెయ్యను చెప్పు. పొద్దుటే వట్టి నీళ్ళు తాగి వచ్చేను. లేక చేసేదేముంది ? వెళ్ళిరావాలి."

"నాతో పదేపదే చెప్పకు, చిన్నమామా! నీయిష్టం వచ్చినట్లు చేయి. నేను మేస్త్రీతనం చేయడానికి రాలేదు. బలవంతపెట్టి ఈ కొరడా నాచేతి కిచ్చారని మీరంతా ఎరుగుదురు." అంటూ లాఓ-ల్యూ సిగ్గు పడుతూన్నట్లు మాట్లాడేడు.

మేస్త్రీని కొంచెం పొంగేసి, ఉబ్బేయ్యాలని చిన్నమామ తలచేడు. "డిప్యూటీ చైర్మన్! ఈ మర్యాద మాటలకేంలే. నువ్వు మా మేస్త్రీవని అందరూ ఎరుగుదురు. నువ్వు అదృష్టవంతుడివి."

ఆ మాటలు అంటూనే ఆతడు చేతిలోని పలుగు క్రింద పారేసి కొండగుట్టల్లోకి క్షణంలో జారిపోయేడు. ఆతడు ప్రొద్దుట ఆఖరికి గంజికూడా త్రాగలేదు. దొడ్డికెళ్ళవలసిన పని లేనేలేదు. కాని, బిగిసి పోయిన రాతినేలని పగలకొట్టడానికి బదులు ఏగుట్టచాటనో, ఎండలో కూర్చుని ప్రకృతిసౌందర్యం అనుభవించడంలో సుఖం వుందని ఆతను ఎరుగును. పైగా ఆ నేల తవ్వే ఓపికకూడా ఆతనిలో లేదు. పొంది కగా కూర్చోడానికి వీలుగా కుర్చీలావున్న ఒక చట్రాయిమీదకి వెళ్ళి చల్లగా చతికిల బడ్డాడు. చలిగాలి కరవొచ్చినట్లు వీస్తూంది. అయినా ఆతడు లెక్కచేయలేదు. వెదురు గొట్టంలో చిలుము వెలిగించి ఆలో చిస్తూ కూర్చున్నాడు. చైర్మను, ఆర్డర్లీ ఆకున్యూ, జపానువాళ్ళ మైత్రి అన్నీ ఆతని మనస్సులో ఒకదాని వెనక నొకటి ప్రత్యక్షం అయినాయి. ఈ మధ్యకాలంలో గ్రామంలో జరిగిన ఘటనలన్నీ ఒకదాని వెనక నొకటి కళ్ళముందు మెదిలినాయి. పొగ తలకెక్కినకొద్దీ ఆతనికి

నిస్సారమైన ప్రపంచంమీద ధ్యాస క్రమంగా అంతర్ధానమై పోయింది. తను పనిచెయ్యాలనేసంగతి పూర్తిగా మరిచిపోయేడు.

ఒక నిముషం పోయేక లూమింగ్ వచ్చి లాఓ-బ్యూ ఎదుట నిల బడ్డాడు. "డిప్యూటీ! కాదు. అపరాధం! మేస్త్రీగారూ! ఈవేళ నాకడుపు ఏమీ బాగుండలేదు. బహుశా ఈ గాలి విసురుకి అనుకుంటాను. అయ్యో! అయ్యో!! " లూమింగ్ పొట్ట రెండు చేతులతో నొక్కిపట్టుకొని, బాధతో గిలగిలలాడేడు. "మేస్త్రీగారూ! ఇంక ఆపుకోలేను."—అంటూ సమా ధానం కోసంకూడా నిలబడకుండా గుట్టలలోకి వెళ్ళిపోయేడు.

లూమింగ్ నిజంగానే బాధపడుతూన్నాడు. వెదురుబొట్ట—చెట్టు బెరడుతో తయారుచేసిన గంజివలన కలిగిన బాధలింకా పోనేలేదు. అతడది త్రాగడం మాననూ లేదు. రోజులు గడచినకొద్దీ బాధలంత కంతకి ఎక్కువౌతున్నాయి. రోడ్డుపనికి కొంతశ్రమ అవసరం. దానికి ఫలితంగా అతని స్థితి మరింత నీరసపడింది. ఆతడు గుట్టల చాటుకి వెళ్ళకపూర్వమే బట్టలో విరోచనం అయి, కట్టుకొన్న ఇజారు డాగులు పడిపోయింది. ఆలాగుతో నలుగురిలోకి ఎల్లా వస్తాడు ? దగ్గరలోవున్న చిన్న గుంటదగ్గిర లాగు ఉతుక్కుంటూ కూర్చున్నాడు. నీళ్ళుచల్లగావుండి వేళ్ళు కొంకరించుకొని పోతున్నాయి. కొంకరించుకుపోతున్న వేళ్ళమీద వూదుకుంటూండడం, మళ్ళీ వుతుకు ప్రారంభించడం. ఈపనితో ఒక గంటకుపైగా గడిచిపోయింది. ఎండలేదు. లాగు ఒంటిమీద పెట్టు కోడం ఎల్లాగా ? అందుచేత లాగును చెట్టుకొమ్మలకుకట్టి, గాలికి చాటుగావున్న ఒకరాతిప్రక్క ముడిచిపెట్టుకొని నిద్రపోవడానికి ప్రయ త్నించేడు.

క్రమంగా ఒకరి తర్వాత ఒకరే గ్రామస్థులంతా "ఒకటి" కనీ "రెంటి" కనీ నెమ్మది నెమ్మదిగా జారుకున్నారు. చివరకు హౌఫా ఒక్కడే మిగిలేడు, ఆతడింక చిన్నమెత్తుకూడా పనిచేయ్యదలుచుకోలే

దని స్పష్టంగా చెప్పేసేడు. చేతులో పార అక్కడే పడేసి, తండ్రికి రెండు మూడు గజాలదూరంలోవున్న ఒక బండ యెక్కి కూర్చున్నాడు. మేస్త్రీ తన కొడుకువేపు అయిష్టంగా చూసేడు. కాని, మాటమాత్రం ఏమీ అనలేదు.

"నాకేసి అల్లా చూడకు. దేశద్రోహి తప్ప, ఈపని ఎవ్వడూ చెయ్యడు. ఈ రోడ్లువేసి, మన నెత్తిమీద గట్టిగా కూర్చోవాలని జపాను వాళ్ళ ఎత్తు; వెర్రివెధవలు చెయ్యాలి ఈ పని; చేస్తే."

తనకొడుకు మాట్లాడుతూన్న మాటలు ల్యూకు ఏమీ అర్థంకాలేదు. తన కొడుకులో ఏదో పెద్ద మార్పు వచ్చింది. జపానువాళ్ళు పట్టణానికి లాక్కుపోయి, రైల్వేమీద పనిలో ప్రవేశపెట్టినప్పుడు అక్కడ ఒక రహస్య సంస్థతో సంబంధం ఏర్పడింది. కూలివాళ్ళలో వచ్చిచేరిన విద్యార్థులు జపానువాళ్ళని తరిమివెయ్యడానికై వాళ్ళలో రహస్యంగా సంఘం పెట్టేరు. వాళ్ళ పాఠశాలలన్నిటినీ జపానువాళ్లు నాశనంచేసి, రైల్వేమీద పనిచేయించి "వారిని బాగు" చెయ్యడానికై ఇక్కడికి ఈడ్చుకు వచ్చేరు. వాళ్లు చెప్పిన వాదాలు హౌఫాకు నచ్చేయి. వాళ్ళలో చేరి సంఘం పనులలో ఎక్కువ శ్రద్ధ తీసుకొన్నాడు. రహస్యంగా జరుగుతూ వచ్చిన రాజకీయ చర్చలలో పాల్గొని, ఎన్నో విషయాలు గ్రహించేడు. రహస్యంగా పనిచేయడంలో సులువులన్నీ తెలుసుకున్నాడు. ఒక విద్యార్థివద్ద సాయంకాలంపూట రహస్యంగా చదవడం, వ్రాయడం కూడా నేర్చుకొన్నాడు.

కొడుకు అవిధేయతకు ల్యూ ఆశ్చర్యం, విచారం పొందేడు. "అందరూ వీలాగే పని చెయ్యం అంటే ఛైర్మనుతో ఏమని చెప్తాను? వాడు నన్ను చావగొట్టేస్తాడు." అంటూ ముసలివాడు కళ్ళ నీళ్లు పెట్టుకొన్నాడు.

"ఛైర్మన్‌పద్దకు పోనేవద్దు. జపానువాళ్ళని తన్నమని ప్రజలతో చెప్పు: కొద్దిమందే వున్నారుగనక ఆపని సులువుగానే చేసెయ్యగలుగు తాము."

"నీకు మతిపోయింది. మళ్లీ అల్లా అన్నావంటే ఛైర్మన్‌తో చెప్తా జాగ్రత్త" అని బెదిరించేడు. ఆవేశం కొద్దీ ఈ పడుచువాడు జపానువాళ్ళమీద పేచీకి సిద్ధపడడం, వాళ్ళు చెట్టుకి వేళ్లాడతీయడం, ముసలితల్లి హడిలి చచ్చిపోవడం, అన్నీ గుర్తుకు వచ్చి అతనికి మహా కోపం వచ్చింది.

"అయితే నువ్వొక దేశద్రోహివి అవుతావు."

"నువ్వే దేశద్రోహివి. నడు పని చెయ్యి." అంటూ ముసిలివాడు గంతులు వేసేడు.

"నేనింక యీపని చెయ్యను" అని హౌఫా అక్కడినుంచి వెళ్ళి పోయేడు. ముసలివాడు భయం, దుఃఖంతో అక్కడే నిలబడిపోయేడు. మిగిలినవాళ్ళందరిలాగానే హౌఫాకూడా కొండల్లోకే వెళ్ళిపోయేడు. అతడు లూమింగ్ కోసం వెతుకుతూండగా ఒక రాతిమీద అర్ధ నిమీలిత నేత్రాలతో ఏవో కలలుగంటూ కూర్చున్న చిన్నమామ కని పించేడు. ఆచుట్టుప్రక్కల ఎక్కడన్నా, ఒకచిన్న బంగారపుగని దొరు కుతే ఏ చిక్కూ దరిద్రం లేకుండా ఏవిధంగా సుఖంగా జీవితం వెళ్ళ బుచ్చగలదో: అతడు ఆలోచించుకుంటున్నాడు. ఒకటికీ, రెంటికీ కూర్చునో, పొగపీలుస్తోనో గ్రామస్థులందరూ హౌఫాకు కనపడ్డారు. కాని, సిద్ధాంతి పొడకూడా ఎక్కడాలేదు.

ఆ గ్రామంలోకల్లా కాస్త చదువుకున్నవాడు లూమింగ్ ఒక్కడు. ఆతనికోసం ఒక అరగంట వెతికి, చివరకు చెట్లకొమ్మల్ని కట్టిన లాగునుపట్టి ఆతడున్నచోటు కనుకున్నాడు. ఆ విద్వాంసుడు ఒక చిన్న గుహలో నిర్వికల్ప సమాధిలో పడివున్నాడు. దగ్గిరికివెళ్ళి చూసేటప్ప

టికి కట్టగుడ్డ లేకపోయినా, చలికి వొణుకుతూనే ఆతడు గుర్రుపట్టి నిద్ర పోతున్నాడని తెలుసుకున్నాడు.

లూమింగ్‌ను భుజంపట్టి కుదుపుతూ, "లూమింగ్ ! లే, యీపాటికి. చలికి బిగిసిపోగలవు. లే" అని పిలిచేడు.

పీడకల కన్నవాడిలాగ లూమింగ్ ఒక్క ఉదుటునలేచి నిలబడ్డాడు. లేవగానే తన శరీరంలో దిగువభాగాన గుడ్డలేదని గుర్తువచ్చి, గమ్మున సిగ్గుతో చదికిలబడ్డాడు. కేవలం సిగ్గుపడడమేకాదు. కొద్దో గొప్పో చదవగలిగి, జ్యోతిషంకూడా చెప్పగల తనవంటివాడు దిగంబరంగా ప్రజల కంటబడడం ఎంతఅవమానకరం ? ఏదోకారణం చెప్పడానికి ప్రయత్నిస్తూ అన్నాడు.

"అయ్యయ్యో !"

"లూమింగ్ ! తెలివితక్కువధోరణి కట్టిపెట్టు. ఇంక ఈ బ్రదుకు సాధ్యంకాదు. ఎవ్వరికీకూడా సాధ్యంకాదు, మానాన్న దేశద్రోహి అయిపోతాడు. మనం ఇల్లాగే రోజులుగడిపేస్తే మనమూ దేశద్రోహులమే అవుతాము. జపానువాళ్ళని ఈదేశంలోంచి తరిమెయ్యాలి. తరిమేస్తాం."

లూమింగ్ చలికి వొణికిపోతున్నాడు. "మనం ఏంచెయ్యగలం."

"జపానువాళ్ళు ఎందరోలేరు. కనక పేచీపెట్టుకోమందాం."

"ఔను చెప్పవచ్చును. చెబుదాం" అని పలికేడు. లూమింగ్. కొత్తకొత్త అభిప్రాయాలూ, భావాలూ అన్నీ తనకే తట్టేటట్లుగా ఆతడు నటిస్తుంటాడు. నిజానికి ఆ నటన జ్యోతిషం చెప్పడంలో చాలాబాగా వుపయోగిస్తూంది. ఆనటనవలన ప్రజలకు ఆతనిలో విశ్వాసంకలుగుతుంది.

వేళాకోళమూ, ప్రోత్సాహమూకూడా దీపించే గొంతుతో హౌఫా "నీకూ అల్లాగే తోచిందా ? మన గ్రామంలోకల్లా దూరదృష్టికలవాడివయ్యా !" అని ఉబ్బేసేడు.

"అందుకేమీ సందేహంలేదు" అన్నాడు లూమింగ్ ఆత్మ సంతృప్తితో. హౌఫా ప్రోత్సాహం ఆతనిలోని కల్పనాశక్తిని రేగొట్టింది. "నిన్నరాత్రి నక్షత్రగణాలని పరిశీలించి చూసేను. మృగవ్యాధ కనబడకుండా దట్టమైన పొగ ఆవరించివుంది. అంటే ఏమిటోతెలుసా? జపాను సలహాదారుకీ ఆతని సైనికులకీ రోజు బాగులేదన్నమాట. అంటే త్వరలోనే ప్రమాదం కాచుకొని వున్నదన్నమాట. అంటే వాళ్ళని మనం చులకనగా మట్టుపెట్టి వెయ్యగలమన్న మాట!"

ఈ పచ్చికోతలకు హౌఫాకు నవ్వువచ్చింది. కాని, జ్యోతిష్కుని ముఖగాంభీర్యము, దిగంబరంగా వున్న ఆతని దీనత్వము చూసి నవ్వలేకపోయేడు. "నీకటువంటి నమ్మకమేవుంటే నలుగురితోను చెప్పు. నీమాటను బాగా త్వరగా నమ్ముతారు." అనిమాత్రం అనగలిగేడు.

తడితడిగావున్న లాగు తొడుక్కుని లూమింగ్, హౌఫాతో కొండమీదికి వెళ్ళేడు. జ్యోతిష్కుడు తాను శత్రువునిగురించి కనిపెట్టిన విషయం అందరికన్నా ముందు చిన్నమామకు చెప్పేడు. నక్షత్రాలను చూచి భవిష్యత్తును పుస్తకం చదివినట్లు చెప్పగల ఈ విద్వాంసుడి ప్రజ్ఞకు ఆశ్చర్యం, శత్రువు ధ్వంసం అవుతాడన్న వార్తకు ఆనందం పొంది చిన్నమామ ఎగిరి గంతువేసేడు.

౽

మరునాడు జపాను సలహాదారు తన ముగ్గురు సైనికులను, చైర్మన్ హాంగ్‌మీనీ వెంటబెట్టుకొని పని యెంతవరకయిందో చూడ్డానికి హఠాత్తుగా వచ్చేడు. వాళ్ళు తలవనితలంపుగా వచ్చేరేమో, లాఓ-ల్యూ నిశ్చేష్టుడైపోయేడు. సలహాదారును అంతదూరంలో చూసేటప్పటికి పిల్లిలోపడ్డ యెలకలా గజగజ వొణికిపోయేడు. ఇంతమందీ కలిపి

మూడు గజాల మేరకూడా ఇంతవరకు తవ్వలేదు. జనం అంతా గుంపుగా నిలబడి జ్యోతిష్కుడు చెప్పిన జపానువాళ్ళ నాశనాన్ని గురించి చర్చలు చేస్తూన్నారు. ముందు వస్తూన్న ముప్పుకూడా వాళ్ళు చూసుకోలేదు.

జపానువాళ్ళు వచ్చి దగ్గర నిలబడేవరకూ వాళ్ళకి తెలియనేలేదు. వాళ్ళు తవ్విన మూడుగజాలమేరా నిజంగా ఒక్కమనిషి తవ్వగలడు. దాన్నిచూస్తే వాళ్ళల్లో వాళ్ళకే నవ్వువస్తూంది. పరిస్థితులంతవరకూ వచ్చేక ఇంక పనిచేస్తూన్నట్లుగా అభినయించి లాభం లేదనుకుని, సరే ఏంజరిగితే జరగనిమ్మని పూరుకున్నారు. నోళ్ళుతెరుచుకుని గునపాల మీద, పారలమీద ఎల్లాపున్నచేతులల్లాగేవుంచి, కళ్ళప్పగించి చూస్తూన్నారు. పనిచెయ్యమని కోరుతూ లాఓ-ల్యూ వాళ్ళచుట్టూ తిరుగసాగేడు. కాని, వాళ్ళుకదలలేదు.

వాళ్ళముఖాలు చూస్తే తెలివిగల ముఖాల్లా కనపడవు. పోనీ వెర్రి పీనుగలనుకుందామా అంటే అదీ వీల్లేదు. ద్వేషంగాని-మైత్రిగాని వాళ్ళ ముఖలక్షణాలలో కనబడదు. వారిని చూసేటప్పటికి సలహాదారు విస్తుపోయేడు. ముఖం జేవురించింది. కళ్లు నిప్పులుకురుస్తూన్నాయి. చేతికర్ర వూపుతూ చిందులు తొక్కేడు. గారడీవాడిని చూస్తున్నట్లు గ్రామస్థులు నోరుతెరుచుకుని ఆతనివంక చూస్తూ నిలబడివున్నారు. అమాయికుల్లా కనబడే వారిముఖాలు చూసేటప్పటికి సలహాదారు మరీ శివాలుతొక్కుతూ కీచుగొంతుతో అరవడం ఆరంభించేడు.

"మన జాతులు రెండింటి మధ్యా స్నేహం నెలకొల్పే పద్ధతి యిదేనా? ఓరి వెధవల్లారా! ఇన్నిరోజులకీ మీరు ఎంత పనిచేసేరో చూసుకున్నారా?"

ఆతడు తన చేతి కర్రపెట్టి అక్కడా, ఇక్కడా పొడిచి వాళ్ళు తవ్విన ప్రదేశం కొలిచి చూసేడు. అంతాచేసి మూడుగజాలు కూడా.

లేదు. అటూఇటూ ఆడుతూన్న ఆ కర్రవేపు చూస్తూ ఛైర్మన్ తెల్లబోయి వాణుకుతున్నాడు. కాని, గ్రామస్థులలో ఒక్కడిముఖాన కూడా చలనం లేదు. దానితో జపాను సలహాదారుకు మరింత ఉద్రేకం కలిగింది. కాలు కాలిన కోతిలా తెగగంతులువేసేడు. చిట్టచివరకు పట్టలేక చేతికర్ర తీసుకుని ఛైర్మన్ నెత్తిమీద ఒక్కటి కొట్టి. "సామ్రాజ్యసేనకి నువ్వు చేసే సేవ యిదా?" అని పళ్ళుకొరికేడు.

అంతవరకు వెర్రిపుల్లియ్యల్లాగ మిడుతూ, మిడుతూ చూస్తూన్న జనం ఛైర్మన్ తన యజమానిచేతనే దెబ్బలు తినడం చూసి ఫక్కున నవ్వేరు.

ఆ నవ్వుచూసి సలహాదారుకు మరీ మంటపుట్టింది.

"నవ్వుతారుట్రా? లంజకొడుకుల్లారా! చూస్తా. ఎంతసేపు నవ్వుతారో." అని తన సైనికులవేపు తిరిగి "తన్నండి, ఈ వెధవల్ని చూస్తారేం?" అని ఆజ్ఞాపించేడు.

జపాను సైనికులు ముగ్గురూ తుపాకి మడమల్ను తిరగేసి ఒకటే కొట్టడం. వెన్నుమీద గట్టిదెబ్బ తగిలి జ్యోతిష్కుడు అందరికంటేనూ ముందు క్రింద బడిపోయేడు. చిన్నమామ రోడ్డుకోసం తవ్విన గోతిలో నిలువునా పడిపోయేడు. జపాను సలహాదారు స్వయంగా డిప్యూటీ ఛైర్మన్ను గూబ పగలేసేడు. ఈ గంద్రగోళంలో తప్పించుకుని గుట్టల్లోకి పారిపోయిన హౌఫా తప్ప అందరికీ తీవ్రంగా దెబ్బలు తగిలేయి.

పని ఎగబెడుతూన్న విధ్వంసకుల్ని చావగొట్టడంతో జపాను సలహాదారు ఆనాటికి తృప్తిపడ్డాడు. వెళ్ళిపోతూ లాట-ల్యూకు మళ్ళీ ఇంకో లెంపకాయ—దయకొద్దీ మొదటిదానంత గట్టిగా కొట్టలేదు—తగలనిచ్చేడు.

"ఇది వూరికే మచ్చు మాత్రమే. ఇంకా మాలుగుబోతుతనం చూపిందారంటే ఉరి తీయిస్తానని చెప్పు మీ వాళ్లతో. అందులో అందరి

కన్నా ముందు నిన్నే వురి తీయిస్తా. విన్నావా? నడు. పని ప్రారంభింప చెయ్య."

జపాను సలహాదారూ, ఆతని సైనికులూ, వాళ్ళ వెనకాల దెబ్బలు తడుముకుంటూ ఛైర్మనూ వెళ్లిపోయారు. తర్వాత కొద్దిసేపటికి గ్రామస్థులంతా ఒక్కొక్కళ్లే లేచేరు. లూమింగ్ రెక్కగూడంతా కదుము గట్టింది. కన్నంతా పొంగి చిన్నమామ గాంఘోళిగాడి వాలకంగా తయారయ్యాడు. లెంపకాయలకు లాఓ-ల్యూ ముఖం ఎర్రబడి, మండిపోతూంది. అంతా నిశ్శబ్దంగా ఒకరిముఖాలు ఒకరు చూసుకొని నిట్టూర్పులు విడిచేరు. వీళ్ళంతా అన్నిమాట్లు ఒకటికనీ, రెంటికనీ వెళ్ళడం వల్లనే ఈ దెబ్బలు తగిలే యనేద్దామనుకున్నాడు ల్యూ. అధమం ఈ పని చేస్తూన్నంతకాలం అయినా ఆకులు-బెరడూ గంజి త్రాగవద్దని చెప్పా లనుకున్నాడు. కాని, తనకు మాత్రం తినడానికి అన్నం వుందా? అనే సంగతి గుర్తుకువచ్చి ఆఖరు నిముషంలో మాట్లాడక వూరుకుని, దవడ మంట తగ్గేవరకూ ఏమీ మాట్లాడకూడ దనుకున్నాడు.

కాని, చిన్నమామ చాలసేపు మాట్లాడకుండా ఊరుకోలేక పోయేడు. లూమింగ్ జ్యోతిషం వట్టితప్పు అని గొడవ ప్రారంభించేడు. "నక్షత్రాలు చూసేనని నువ్వు చెప్పింది అంతా అబద్ధం" అని లూమింగ్ మొహం మీదనే అనేసేడు. "చూడు ఎంత ఘాత జరిగిందో. ఆఖరికి నీకైనా దెబ్బలు తప్పేయా? నేనే గనక నీ స్థానంలో వుంటే జపాను వాళ్ళల్లా 'హరకిరీ' చేసుకుని వుండే వాడిని."

లూమింగ్ సిగ్గుపడ్డాడు: కాని, తన విద్యలో లోపం వుందని ఆతడు అంగీకరించ తలుచుకోలేదు. అల్లా వొప్పుకుంటే ఎంత అప్రతిష్ఠ? తను చెప్పిన జ్యోతిషం అబద్ధమైతే సాముద్రికం మాత్రం నిజమని ఎవరు వొప్పుకుంటారు. అదేగనక జరిగిందంటే మాడి చావాలి.

చిన్నమామ మాట అంత తేలికగా విడువడు. అందుచేత బుకా యింపు ప్రారంభించేడు. "నేను చెప్పింది అక్షరాలా జరిగి తీరుతుంది. చూస్తూండండి!"

"చూశాం. చూశాం. ఇదివరకు చూసింది చాలు." అని చిన్న మామ ఎగతాళిగా అన్నాడు. వాగ్వాదం విని నలుగురూ పోగయ్యేరు. నలుగురిలోనూ అవమానం పాలవడం ఇష్టం లేక లూమింగు మరింత గట్టిగా వాదించసాగేడు.

వృత్తి ధర్మంగా అలవాటయిన గాంభీర్యంతో "అట్టే తొందర పడకండి. వినండి. జపాను సలహాదారునీ, వాడి సైనికులనీ అప్పుడే పెద్దమ్మ ఆక్రమించుకుని కూర్చుంది. చూడండి వాళ్ళప్రవర్తన: ఆ గంతులు, ఆ ఉరుకులు, ఆ కొట్టడం, కొరివి కర్రలనీ, రైఫిల్లనీ తిప్పుతూ కోతుల్లా అరవడం చూసేరుకదు? వాళ్లు మనుష్యుల్లాగే ప్రవర్తించారంటారా? మీరే చెప్పండి. వాళ్లని పట్టిన దయ్యాలే వాళ్లచేత అల్లా ఆడిస్తున్నాయి. నామాట నమ్మండి. వాళ్లరోజులు దగ్గరపడ్డాయి." అన్నాడు.

ఎల్లాగయినా కసితీర్చుకొనడానికి ఆతృతపడుతున్న రైతుయువకులు "నిజమేనా?" అని పదేపదే ప్రశ్నించుతూన్నారు.

అప్పుడే గుట్టలచాటునుంచి వచ్చిన హూఫా "సందేహం ఎందుకు?" అనేసేడు. "కాని వాళ్లని నాశనం చెయ్యాలంటే మనం దెబ్బలాడాలి. వాళ్ళంతటవాళ్లు పోరు. వాళ్ళకంటె చాలా హెచ్చుమందిమి వున్నాంగనక మనం దెబ్బలాడగలం."

"అద్దుగదీ సంగతి! చూసేరా, మరి!" అంటూ లూమింగు హూఫా వంక అప్యాయంగా చూసేడు. "చాలా మంచివాడివోయి. చూసి నామాటలు నమ్మడంలేదు వీళ్లు!"

"భేష్! అయితే దెబ్బలాడుదాం" అని యువకులు ఏకగ్రీవంగా

తమ అభిప్రాయం ప్రకటించేరు.

"చూడండి! అదిగో మేరోజ్ వస్తూంది." అని ఒకపడుచువాడు ఉద్రేకంతో కేకపెట్టేడు.

అందరూ ఆతను చూపిస్తూన్నవేపు తిరిగి చూసేరు. మేరోజ్ బహు ఒయ్యారంగా వారివేపు నడిచివస్తూంది. జపాను సలహాదారు యింట దాసీగా చేయబడిన నాటినుంచీ పడుచువాళ్ళు ఆమెనుగూర్చి కలలు గంటూన్నారు. ఆమె నలుగురితోను బహు సరదాగా వుంటుంది. తనకంట బడినవీ, తన జీవితంలో జరిగినవీ అన్నీ కూడా జంకూకొంకూ లేకుండా బహు చిత్రంగా చెప్పి నవ్విస్తుంది. "ప్రేమ చూపగల శక్తిగల వాళ్లతో స్నేహంగా వుంటానికి నాకభ్యంతరం లే"దంటుంది.

ఒక్కనిముషంలో ఆమెయే వచ్చేసింది.

"చవటలు మీరందరూ. నన్ను పూర్తిగా మరిచిపొయ్యారు. నన్ను జపానువాడి పక్కలో పడుకోబెట్టి మీరంతా సుఖంగా కాలక్షేపం చేస్తున్నారా ?"

ఆమె తిడుతూన్నది అక్కడున్నవాళ్ళందరినీ వుద్దేశించే అయినా, ఆమెకళ్లు హౌఫామీదనే వున్నాయి.

"ఏం జరిగింది ? ఎందుకు అల్లాతిడుతున్నావు ?" అని లూమింగ్ ఆశ్చర్యంతో, సానుభూతితో ప్రశ్నించేడు.

"చూడండి, ఎల్లావున్నానో, నాపడుచుదనం, అందం అన్నీ పోయినాయి. ఆలంజకొడుకులు ఆవెధవకొంపలో నన్ను మూసిపెట్టి రాత్రీ పగలూ నామీద స్వారీచేస్తున్నారు. దున్నపోతులు. యంత్రం అనుకున్నారో యేమో. ఈవేళ పొద్దుటే వీధిలోకి చచ్చేరుగనుక గాని, చచ్చినా నాకక్కడ దిక్కులేదుగదా ?

అని మేరోజ్ ఎంతోవేదనతో మాట్లాడింది.

"నీ అందం, నీపడుచుదనం ఎక్కడికీ పోలేదులే." అని ఒక

రైతుయువకుడు ఆమెను అనునయించాడు. నిజానికి మేరోజ్ చిక్కిన ట్లున్నా ఆకర్షకంగా, పడుచువాళ్ళని ఉవ్విళ్ళూరిస్తూనేవుంది.

ఆమాటకి మేరోజ్‌కు కోపంవచ్చింది. "మీలో ఒక్కడికీ హృద యంలేదు. చావండి. మీమీద జపానువాళ్ళు చెయ్యిచేసుకోకుండా వుండ డంకోసం నేను వాళ్ళదగ్గిరికి వెళ్లను. కావలసివస్తే మీపెళ్ళాల్ని పంపు కోండి. వాళ్ళకీ తెలిసివస్తుంది."

అప్పుడుగాని హౌఫా కలగచేసుకోలేదు. "మే! అట్టే తెలివి తక్కువగా మాట్లాడకు. నువ్వు వెనక్కివెళ్ళు. ఈవేళరాత్రి నువ్వు ఒక్క పనిచేస్తే జపానువాళ్లని చంపేస్తా. దానితో నీ శనీ, మాశనీకూడా వొదిలి పోతుంది. ఆ వెధవజపానువాళ్లతోనే వుంటే నీకు మొగుడు దొరకడం సాధ్యంకాదు. వాళ్ళు వొదిలిపోతే నీకూ లాభంవుంటుంది. వేళాకోళం కాదు! నిజం! ఈ వేళకి వెళ్ళు."

"మొగుడు దొరక్కపోతే మానెలే. నీబోటి చవటనొకడిని కట్టు కోడానికి నేనేం కంగారుపడడంలేదు." అని గదమాయించింది. కాని, అంతలో మళ్లీ ఆలోచించింది. మెత్తపడింది. ఆమె గొంతులోకూడా మార్పు కనబడింది. "సరే. దానివలన మీకు లాభం వుంటుందంటే చేస్తాను. నన్నుగురించి విచారంలేదు."

హౌఫా ఒక్కమారు నలుగురిముఖాలూ చూసేడు. అందరూ ఆతని సలహాకి దిగ్భ్రమచెందినట్లు విశ్శబ్దంగా నిలబడివున్నారు. ఆతని తండ్రి ముఖంలో కూడా ఆదుర్దావున్నా, ఆతడూ ఏమీ అనలేదు. హౌఫా మేరోజ్ వంక చూస్తూ ఆమెకు చేయవలసినపని బోధించసాగేడు.

"మే! అర్ధరాత్రివేళ, జపానువాళ్ళు అంతా నిద్రలో వున్నప్పుడు తలుపుతియ్యి. మేం వొస్తాం. చప్పుడుకానివ్వకు. చేసేవా కాల్చి చంపే స్తారు. జాగ్రత్త. వెనక్కితిరిగిపో. తర్వాత నీ అందం, పడుచుదనం తిరిగి వస్తాయిలే."

హౌఫా మాటలువిని జనులందరూ ఆలోచనలో పడ్డారు. పేరో జును ఆతడు కొంతదూరందాకా సాగనంపి తిరిగి వచ్చేడు.

"నాన్నా! నా ఏర్పాట్లు ఏవీ ఛైర్మన్‌కి చెప్పబోకు. చెప్పేవా, నీవంటి దేశద్రోహి ప్రపంచంలో వుండబోడు. చీనాదేశం నిన్ను క్షమించదు. నువ్వు చెప్పవు. కాదూ?"

"చెప్పడు." అని ఎన్నో యువకకంఠాలు ఒక్కమారు లేచేయి. "చెప్పడానికి వీల్లేదు. ల్యూ బాబు? చెప్పడానికి వీలులేదుసుమా!"

లాఓ-ల్యూ తలతిప్పేడు. ఆతని ముఖాన లెంపకాయలు జిల వదలలేదు. తలదిమ్ము తగ్గలేదు. ప్రపంచం మారిపోయిందని గుర్తించేడు. అన్నిమూలలా పోరాటాలు సాగుతున్నాయి. వెనకటిలాగ శాంతంగా వుండడానికి వీలులేదు అని గ్రహించేడు.

"చెప్పను. నేనూ మీతోవస్తాను."

## ౧౦

ఆ రాత్రంతా గాలి హోరున వీస్తూనే వుంది. ఉత్తరపుగాలిలో మంచుతెరలు సుడులు తిరుగుతున్నాయి. ఆ రోజున మంచు విశేషంగా పడుతుందని గ్రామస్థులందరూ అనుకున్నారు. చలికి వొణికిపోతూ ఎవరికి వారే చీకటి యిళ్ళల్లో మేలుకొని కూర్చున్నారు. ఎక్కడా ఏవిధమైన ధ్వనీ వినబడ్డంలేదు. గ్రామం అంతా బహునిశ్శబ్దంగా వుంది.

అర్ధరాత్రివేళ ఊళ్ళో యువకులంతా వీధుల్లోకి వచ్చేసేరు. మంచు మీద నడిచినా శబ్దం కాకుండా కాళ్ళకు జమ్ము జోళ్లు తొడుక్కున్నారు. అందరూ వచ్చి లాఓ-ల్యూ ఇంటి ముందు సమావేశం అయేరు. ముసిలివాడూ, కొడుకూ వాళ్ళకోసం కనిపెట్టుకొని గుమ్మంలోనే నిలబడి

వున్నారు. అందరూ బయలుదేరే ముందు ఎక్కడన్నా ఏపన్నా ధ్వని అవుతూందేమోనని ఊపిరి బిగబట్టి విన్నారు. ఆఖరుకి గుడ్లగూబల, గబ్బిలాల రెక్కలచప్పుడు కూడా ఎక్కడా వినబడ్డంలేదు. దట్టమైన మంచు, భయంకరమైన నిశ్శబ్దం.

సరిగ్గా నడిరాత్రివేళ అందరూ కలిసి హౌఆ ఇంటివేపు బయలు దేరేరు. గుమ్మం దగ్గర ఎవ్వరూ లేరు. కాపలావున్న ఆక్యూ గుమ్మం పొదిగట్టు, గోడకి జేరబడి కూర్చునే విద్రబోతున్నాడు. ఒక పాత తుపాకీ ప్రక్కనే వుంది. ఆవెర్రివాడు చలికి ఇంచుమించు బిగిసి పోయినా, పిల్లులు కొట్లాడుతూన్నంత హోరుగా గురకపెడుతున్నాడు. రైల్వే పనివాడుగా వున్నప్పుడు హౌఫా తుపాకి కాల్చడం రహస్యంగా నేర్చుకొన్నాడు. నేలమీదవున్న తుపాకీ నాతడు చేత్తో తీసుకున్నాడు. ఈ లోపున ఇంకో బలిష్ఠుడైన యువకుడు ఆక్యూను చేతులలోకి ఎత్తు కొని, అక్కడికి ఒక ఫర్లాంగు దూరంలోవున్న ఒక గుడిసెలోకి తీసుకు పోయి పడుకోబెట్టేడు. కుదుపుకు కొంచెం తెలివివచ్చినా, గుడిసె లోని వెచ్చదనానికి ఆతడు వెంటనే మళ్లీ గుర్రు సాగించేడు.

ఇంతలో సలహాదారు కార్యాలయం తలుపు చడీచప్పుడూ లేకుండా తెరువబడింది. రెండు చేతులలో రెండు తుపాకులు పట్టుకొని మేరోజ్ గుమ్మంలో కనబడింది.

రెండు చేతులలోని రైఫిళ్లనూ ఇద్దరు పడుచువాళ్ల చేతుల్లో పెట్టి "తీసుకోండి, జపానువాళ్లు లేవలేదు ఇంకా" అని పెదవులు కదిపింది.

హౌఫా బహు నెమ్మదిగా "రాండి, లోపలికి" అంటూ దారి తీసేడు.

మేరోజ్ దారి చూపిస్తూంటే జపానువాళ్లు పడుకున్న గదుల్లోకి నెమ్మదిగా ప్రవేశించేరు. అట్టే శ్రమ లేకుండానే ముగ్గురు సైనికులనూ పీకలు నొక్కేసి, నోట్లో గుడ్డలుకూరి కాళ్లూ చేతులూ కట్టేసేరు. సైని

కులు తమ గొంతుకలమీది చేతులు విదిలించుకుని లేవాలని ఎంతో ప్రయత్నం చేసేరు. కాని, రైతు కుర్రాళ్ల చేతులు బురదగుంటల్లో బొమ్మిడాయిల్ని పట్టుకోడానికి బాగా అలవాటుపడ్డ చేతులాయె. అందు చేత వాళ్లు గుంజుకున్నకొద్దీ పట్టు మరింత బిగిసిందేగాని సడలలేదు.

మరోగదిలోవున్న జపాను సలహాదారు కొంచెం మెలకువగా వున్నాడు కాబోలు నలుగురూ గదిలోకి వెళ్లేటప్పటికి లేచేడు. కాని, తలగడక్రిందవున్న రివాల్వరుకోసం చెయ్యి చాచేలోపున హౌఫా తన చేతిలోవున్న తుపాకీ మడమ తిరగేసి నెత్తిమీద సత్తువకొద్దీ ఒక్కటి కొట్టేడు. ఆతడింక చెయ్యి చాపలేదు. చిన్నమామ క్షణంలో నడుముకు కట్టుకున్న అంగావ్రుం తీసి పెడరెక్కలు విరిచి కట్టేసేడు. చైర్మన్ మాత్రం తప్పించుకొని పోయేడు. ఆ వూళ్లో దార్లన్నీ ఆతడికి కొట్టిన పిండే కనక చీకట్లో మళ్లీ ఎవళ్లకీ కనబడలేదు.

చిన్నమామ సలహాదారుని పెడరెక్కలు విరిచి కట్టివేసేక గంభీరంగా "ఏం చేద్దాం ఇప్పుడు, ఈ వెధవ కుళ్లపీనుగుని ఉరితియ్యడానికి తీర్మానం చేద్దాం. రాండి. ఏడీ డిప్యూటీ చైర్మన్" అని నలుదిక్కులూ చూసేడు.

"ఔను. వీడిని ఉరితియ్యడానికి తీర్మానించవలసిందే. డిప్యూటీ చైర్మన్! ఉరి తీస్తాం ఆజ్ఞ ఇవ్వవయ్యా!" అంటూ లూమింగ్ ఉత్సాహంతో అరిచేడు.

కాని, లాఓ-ల్యూ ఏడి ? ఎక్కడికో వెళ్ళిపోయేడు. లూమింగ్‌కు మహా ఆతురతగా వుంది. జపాను సలహాదారునీ, వాడి సైనికుల్నీ ఉరి తీసెయ్యాలి. గ్రామంలోకల్లా కాస్త హోదాగలవాడు ఆనాడు మరి డిప్యూటీ చైర్మను ఒక్కడే. ఆ విఖ్యాతపురుషుడికి తన జ్యోతిషం ఎల్లా ఫలించిందో చూపించాలి. అందుకోసం మూలమూలలు వెతకడం ప్రారంభిం

చేడు. కాని, చివరకు బహుశా ఇంటికి వెళ్ళిపోయేడేమోనని తోచి గబ గబ ల్యూ గుడిసెకు పరుగెత్తేడు. అక్కడ లాఓ-ల్యూ దేవుడి గూడు వద్ద మోకరిలబడి, తలవొంచుకొని ఏదో ప్రార్థన చేస్తున్నాడు. మోటు తనంగా రైతుయువకులు జపానువాళ్ళని కొట్టి చంపివేసేరనుకుని, ఆయన వాళ్ళ ఆత్మశాంతికోసం ప్రార్థిస్తున్నాడు.

"ప్రభూ ! వాళ్ళ ఆత్మలను సముద్రం దాటించి వాళ్ళవూళ్ళకి తీసు కొనిపో. వాళ్ళకికూడా పెళ్ళాం,పిల్లలు వుండివుంటారు. వాళ్ళంతా ఆఖరు పర్యాయం ఒక్కసారి చూడాలనుకుంటూ వుంటారు. ప్రభూ ! దయా దాక్షిణ్యాలు ఎరగని ఆ కజ్జాకోరువాళ్ల ఆత్మల్ని పందుల్లాగా, కుక్క ల్లాగా మార్చేముందు, ఒక్కమారు వాళ్ళయిళ్ళకు తీసుకుపోయి చూపించు...."

అనవసరమైన ఈ దైవప్రార్థన విని లూమింగ్ నిశ్చేష్టుడైపో యేడు. కాని, అల్లాగ ఎంతోసేపు వుండలేదు.

"డిప్యూటీ చైర్మన్ ! మతిలేనట్లు వ్యవహరించకు. లే. వాళ్ళకి అసలు ఆత్మలే లేవు. వాళ్ళని వురితియ్యడానికై నీఆజ్ఞకోసం అందరిం కినిపెట్టుకొని కూర్చున్నాం."

లాఓ-ల్యూ కదలలేదు. ఇంకా ప్రార్థన చేస్తూనేవున్నాడు.

లూమింగ్‌కు ఆత్రం ఎక్కువయింది. ముసిలివాడి చేయిపట్టుకొని లాగడం ప్రారంభించేడు.

"నీకేం మతిపోయిందా యేమయ్యా ? ఆ కోతివెధవలకోసం నువ్వు ప్రార్థనచెయ్యడం ఏమిటి ? భయపెట్టి నీ పెళ్లాన్ని చంపివేసిన మాట మరిచిపోయేవా ?"

లాఓ-ల్యూ ప్రార్థన అంతాఅయేక లేచేడు.

"మనం జపానువాళ్ళం కామని మరిచిపోకు. మనం మనుష్యుల్లా ప్రవర్తించాలి."

"చార్లీవయ్యా!" అంటూ లూమింగ్ ఆతనిని తోసుకుంటూ హాల భవంతివేపు లాక్కుపోయాడు. కొంతదూరం వెళ్ళేక నెమ్మదిగా ఆతనిని అనునయించడం మొదలుపెట్టేడు.

"ఆఁ. అన్నట్లు మరిచేపోయాను. పూరివాళ్ళతో చెప్పేటప్పుడు కాస్త నన్ను మరిచిపోకేం. లూమింగ్ జ్యోతిషం నిజం అవుతుందని కొంచెం గట్టిగా చెప్పాలిసుమా!"

లాఓ-ట్యూ ఏమీ సమాధానం ఇవ్వలేదు. మంచు తెరలు తెరలుగా కురుస్తూందేమో ముసిలివాడు నిలువునా వొణికిపోతున్నాడు.



---

# శాల్యాట్

చీకటి పడేముందు కొండ వెనకనుండి సన్నగా జేగంట చప్పుడు వినబడసాగింది. ఆధ్వని నాలుగు మూలలకీ పాకి క్రమంగా దగ్గరగా వస్తూంది. సాయంకాలపు పిల్లవాయువులకి పర్వతసానువులమీది గోధుమ చేలు కదులుతూ ఆగంట చప్పుడుకి లయవేస్తూ, తలలూపుతూన్నట్లుగా వున్నాయి. సూర్యుడు అస్తమిస్తూన్న సమయంలోని ఆ గంటచప్పుడు గ్రామాలలో సంచలనం కలిగించింది.

కొండ దిగువనున్న పల్లెటూరి ప్రజలలోకూడా కదలిక వచ్చింది. చేతికి దొరికిన ఆయుధాలు తీసుకొని గుడిసెలలోంచి బయటకు వచ్చి, వీధి మొగలో గుమిగూడేరు. పారలు, గునపాలు, బడితెలు, అడివి పందుల్ని వేటాడ్డంలో ఉపయోగిస్తూ వచ్చిన పూర్వకాలపు పాత తుపా కులు,- ఏది కనిపిస్తే, ఏది చేతికందితే అది తీసుకువచ్చేరు. చంకలను పిల్లల నెత్తుకొని, కొంతమంది స్త్రీలుకూడా వచ్చి దూరంగా నిలబడి వాళ్ళని చూస్తూన్నారు. ఆకలికి నకనకలాడుతూన్న బిడ్డలు తల్లుల గుండెలమీది చింకిరి గుడ్డలు లాగెయ్యడానికి ఎగబడుతున్నారు. ఆకా శాన మబ్బులు కమ్ముకు వస్తున్నాయి. ఇళ్ళల్లోంచి వస్తూన్న పొగ ఉంగ రాలు చుట్టుకుంటూ ఇళ్ళ కప్పులనుండి పైకి పాకుతూంది. అందరూ ఆ సాయంకాలపు శోభను చూస్తూ నిశ్శబ్దంగా నిలబడ్డారు.

జనం మధ్యనుండి నల్లటి ముఖం గల ఒక బలిష్ఠుడు ముందుకు అడుగుబెట్టి, మాట్లాడ్డం ప్రారంచేడు.

"పెద్ద ఆఫీసునుంచి హెచ్చరిక గంట కొట్టుకుంటూ ఇప్పుడే ఒక మనిషి వచ్చేడు. ఇరవైమంది జపానువాళ్ళ దళం వొకటి యిల్లా వస్తూన్నదట. వాళ్ళని మనం అడ్డం కొట్టాలి. కనక మీరంతా వరసలో నిలబడండి."

అంటూ ఆతడు మడమలు రెండూ టక్కున దగ్గరకుచేర్చి ఎడమ అరచేతిని ఎడమ కంటిప్రక్కకు తకీపని ఎత్తేడు. ఆతడు ఇటిక తీసేవాడుగా పనిచేసే రోజుల్లో ఒకమారు ఆవం మంటలు నెత్తిమీది జుట్టు నాకేసేయి. అప్పటికీ ఇప్పటికీ మళ్ళీ ఒక్క తలవెంట్రుకకూడా మొలవలేదు.

గ్రామస్థులంతా ఇటికతీసేవాడు మిలిటరీ శాల్యూట్ చేయడం, ఆతని చురుకుదనం చూసి ఆశ్చర్యపడుతూ బారులు తీర్చి నిలబడ్డారు. పరాక్రమం, ధైర్యంచూసి ప్రజలు ఆతడిని గెరిల్లా దళానికి నాయకుడుగా ఎన్నుకున్నారు. అంతకితప్ప ఆతనికి మిలిటరీశిక్షణ ఏమీలేదు. ఆతడు తన జీవితంలో ఆ గ్రామాలు విడిచి బయటిప్రపంచంలోకి వెళ్లనేలేదు కూడా. కొందరు "ఆహా ! ఏమి మనిషోయ్ ! ఏమి తెలివోయ్ !" అని తమ నాయకుడి శక్తిసామర్థ్యాలను మెచ్చుకుంటూ, ఆతనివేపు రెప్ప వాల్చకుండా చూస్తున్నారు. పొట్టిగావున్న ఒక గూనివాడు ఉత్సాహం పట్టలేక తానుకూడా ఆ మిలిటరీ మర్యాదని అనుకరించబోయేడు. పాదాల మడమలు చేర్చి V ఆకారంలో నిలబడి, ఎడమచేతిని నుదుటికి ఆనించేడు. తర్వాత ఏంచెయ్యాలో తెలియక బొమ్మలా అల్లాగే నిలబడి పోయేడు.

"పొట్టిమామా ! అట్లాకాదు." అని ఇటికతీతవాడు ఆతన్ని విమర్శించేడు. "నువ్వు చేస్తూన్నది జపానువాళ్ల శాల్యూటు. మనం ఇప్పుడు అమెరికావాళ్ల శాల్యూటు చేస్తున్నాం. ఇదిగో ఇల్లాగచెయ్యాలి. చూడు."

కమాండరు మళ్ళీ ఒకమారు తాను శాల్యూట్ చేసి చూపించేడు. గూనివాడు తనకాళ్లూ, చేతులూ ఎల్లా కదపాలో ఎరక్క, మొట్టమొదటి పోజులోనే నిలబడి పోయి, పెదవులు దగ్గరగా మూసుకొని తన చిన్ని కళ్ళలోంచి సేనానాయకునివేపు పరీక్షగా చూడసాగేడు.

"జపానువాళ్ళ శాల్యూట్ చాలాబాగా చేస్తున్నాడు."

అని జనంలో ఒకరు వ్యాఖ్యానించేడు. మిగిలినవాళ్ళంతా ఫక్కున నవ్వేరు.

"చాలు. సోదరులారా! వెడదాం నడవండి. ఒకటి.... రెండు.... మూడు...." అంటూ ఇటుకతీతవాడు గంభీరంగా ఆజ్ఞాపించేడు. ఆతడు ముందు నడుస్తూంటే మిగిలినవాళ్ళంతా అతని వెనకనే కదిలేరు. ఆ గ్రామానికి మూడుమైళ్ల దూరంలోవున్న మోటారురోడ్డు వద్దకు వీరంతా వెళ్లాలి. మగవాళ్లంతా వెళ్లిపోయేక ఆడవాళ్ళు తమయిళ్ళకి తిరిగి వెళ్ళిపోయేరు.

సరిగ్గా ఈ జనం వూరు వదలి చేలగట్లమీద అడుగు పెడుతూన్న సమయంలో గూనివాడు ఏదో జ్ఞాపకం వచ్చి పంక్తిలోంచి తప్పుకొని, ప్రక్కనే వున్న ఒక దిబ్బ ఎక్కేడు. దూరాన ఒకస్త్రీ తన గుడిసెలోకి వెళ్ళబోతూ, అతని పొలికేకకు నిలబడి పోయింది.

"ఓహో కాకమ్మో!" (ఇది అతని భార్యకు పెట్టిన వేళాకోళపు పేరు) దీర్ఘం పూర్తికాగానే అతడు తనతప్పు దిద్దుకొని "ఓలి, చిలకమ్మో!" (ఇది అతని భార్య చిన్నప్పటి పేరు) అని మళ్లా కేకపెట్టేడు.

"ఓలి, చిలకమ్మో! ఆవుగాట్లో గడ్డెయ్యడం మరచిపోకు. రేపు నాగలి లాగలేదు సుమీ! నాకోసం అన్నం వొండి చిక్కుడు గింజలు పుడకపెట్టు. రాత్రి తిండిలేకపోతే రేపు పనిచెయ్యలేను. మరిచిపోకు."

పెళ్ళానికి చెప్పవలసిన వేవో చెప్పి తిరిగి వచ్చేటప్పటికి అందరూ అతని కోసం కనిపెట్టుకొని నిలవబడి వున్నారు. ఇటిక తీత వాడు, తొందర పడుతున్నాడు. గూనిమూప వొగర్చుకుంటూ రాగానే అతడు దగ్గరకు పిలిచేడు.

"మామా! ప్రయాణంలో వుండగా పంక్తి తప్పకూడదు, తప్పని సరి వస్తే నాతో చెప్పి మరీవెళ్ళాలి."

"అల్లాగే" నని గూనివాడు తన స్వంతపద్ధతిలో మడమలు

లాటించి నుదుటివరకూ చేయెత్తి శాల్యూట్ చేసేడు.

నిలువెత్తు పెరిగిన గోధుమచేలల్లోబడి వారు నడుస్తూన్నారు. గాలికి పంటమీదవున్న చేను తలూపుతూ హుషారు ఇస్తూన్నట్లుగా వుంది. అంత కంతకి గాలి తీవ్రం అవుతూంది. దూరాన్నుంచి దేవదారు అడవుల మర్మరధ్వనులు గాలిబారున చెవిని పడుతున్నాయి.

"అన్నలారా! త్వరగా నడవండి. జపానువాళ్ళు రాకముందే మనం రోడ్డుమీదికి చేరుకోవాలి."

"అల్లాగే." అంటూ గూనివాడు మళ్ళీ పంక్తి తప్పి బయట నిల బడ్డాడు.

"ఆగండి! కమేండర్! నా లాగు జారిపోయింది. తిండి తిన లేదుగా మరి. ఒక్క నిముషంలో కట్టేసుకుంటాను."
అందరూ నిలబడిపోయేరు. గూనిమామ లాగు కట్టుకోడానికి ఐదు నిమి షాలు పట్టింది. మాటిమాటికి ముడి జారిపోయి లాగు క్రిందికి జారిపడి పోతూంటే అంతా పకపక నవ్వుతున్నారు. చివరకు కమేండరుకి కోపంకూడా వచ్చింది.

ఒకగంటసేపు నడిచి వాళ్ళు పెద్దరోడ్డు చేరుకున్నారు. అంతులేని గోధుమచేలగుండా ఉత్తరపు దిశనుండి రోడ్డు ఒక కొండవరకూ వచ్చి, అక్కడినుండి మోచేతి మలుపుగా తూర్పుకి తిరిగింది. మలుపులో కొండదిబ్బమీద చెట్లు చేమలు దట్టంగా రోడ్డుకంటా వ్యాపించివున్నాయి.

"ఈ పొదల వెనక్కాల ఎంతరేనా దాగవచ్చు" నని కమేండరు తన అనుచరులకు బోధించేడు.

"బాగా రాళ్లు పోగుచేసుకోండి. కాని, శత్రువు సరిగ్గా మీ ముంద రికి వస్తేగాని విసరకండేం! కొట్టేటప్పుడు సరిగ్గా తలకి గురిచూసి కొట్టండి. ఒక దెబ్బకు దిమ్మతిరిగి క్రిందపడిపోవాలి. క్రిందపడ్డాక పలు గులతోటీ, పారలతోటీ వాళ్ళపని పడదాం. నడవండి."

రైతులందరూ తలొక పొదమాటునా దాగుకొనేందుకు వెళ్ళి పోయేరు. కమేండరు మిట్టమెక్కి శతృవుల రాకను కనిపెట్టడానికి వెడుతూన్నవాడల్లా ఏదో జ్ఞాపకం వచ్చి వెనకతిరిగి వచ్చేడు.

"గూనిమామ! నువ్వు ఇక్కడకాదు. అదిగో చూడు ఆ చట్రాయి! దాని వెనకాలకూర్చో."

"అలాగే" అన్నా నిరుత్సాహంతోనే గూనివాడు తనకు నిర్దేశించిన చోటికి పోయి కూర్చున్నాడు. ఆ రాయి మలుపుకి ఒక ఫర్లాంగు దిగువగావుంది. అక్కడ వుంటే యుద్ధంలో పాల్గొనడానికే వుండదు. కమేండరు తనకి ఎప్పుడూ అల్లాంటిచోట్లే చూపిస్తాడు. ఎంత అవమానకరం? సిగ్గుచేటు!

గూనివాడు బాగా కష్టపడి పనిచెయ్యగలడైతే. కాని, యుద్ధానికి పనికిరాడు. అంగవైకల్యంమూలంగా శరీరలాఘవం లేదు. అందుచేతనే ఆదళంలోంచి తప్పుకోమని కమేండరు ఎన్నోమార్లు చెప్పేడు. కాని, రెండు కారణాలవలన ఆతడు ఆ సలహాను పొడూగునా నిరాకరిస్తూనే వస్తున్నాడు. ఒకటేమిటంటే మూడేళ్ళక్రితం జపానువాళ్ళు ఇక్కడికి వచ్చినప్పుడు మాంసంకోసం ఆతని యెద్దును చంపేసేరు. రెండోది, ఒకమారు ఆతనిభార్య వాకట్లో బట్టలు ఆరగడుతూంటే ఒక జపానువాడు ఆదారిన పోతున్నాడు. వాడు ఆమెను చూసి, వెకిలినవ్వు నవ్వుతూ ఎదురుగా నిలబడే ఒకటికి పోస్తున్నాడు. "ఏమిట్రాఅది? అని తాను వీధిలోకి వచ్చేటప్పటికి వాడు గూబ పగలేసి, కొంపకి నిప్పుపుల్ల గీసేడు. తనకి జరిగిన అన్యాయాలను ఆతడు మరిచిపోలేదు.

రాతివెనకాల, రోడ్డుకి యిరవైగజాల దూరంలో కూర్చుని ఆతడు సిగ్గుపడ్డాడు. విచారము ముంచుకొచ్చింది. తనకి ఎప్పుడూ ప్రమాదం గలగనంత దూరంలో వుంచినందుకు సిగ్గు. అతన్నిగూర్చి

ఆతని యుద్ధచాతుర్యాన్ని గూర్చి ప్రజలు ఏమనుకొనిపోతారో యని విచారం. ఈ దురదృష్టానికి అంతకూ కారణం తన గూనేఅని దాన్ని నిందించుకున్నాడు. మండిపడ్డాడు. సరిగ్గా ఆసమయంలోనే రోడ్డుమీద గుర్రపుడెక్కల చప్పుడు వినిపించింది. క్రమంగా జపానువాళ్ళు దగ్గిరి కొచ్చారు.

మిట్టమీదినుండి కమేండరు "కొట్టండి" అని ఆజ్ఞాపించేడు. యంత్రంలోంచి పడ్డట్లు రాళ్ళు ధారాపాతంగా పడసాగేయి. రాళ్ళవర్షానికి రోడ్డుమీదనున్న గుర్రాలు కలగత్రొక్కడం ప్రారంభించాయి. శత్రువు తమరిని దారికాచి కొడుతున్నాడని జపానువాళ్ళు గ్రహించేరు. గబగబ రైఫిళ్ళు కాల్చేరు. కాని కటికచీకటి కాపడంవలన ఎవ్వరిమీదా గురిపెట్టి కాల్చడానికి వీలుచిక్కలేదు. కొద్దిమంది జపానువాళ్ళకి గట్టిదెబ్బలు తగిలేయి. చాలా గుర్రాలకి కాళ్ళు విరిగేయి. దానితో జపానువాళ్ల దెబ్బలు తగిలినవాళ్ళని మోసుకొని వేగంగా పరుగెత్తవలసి వచ్చింది.

గుర్రాలమీద పారిపోతూన్న జపానువాళ్లు నీడల్లా గూనివానికి కనబడ్డారు. ఆతడు చేతిలో మంచి గట్టిరాతిని. గట్టిగా పట్టుకుని నిల తాను దాగివున్న బండవెనకనుంచి ఇవతలకు రావడానికి ఎన్నిమాట్లో ప్రయత్నించేడు. కాని, సాహసం చాలలేదు. అంతమంది జపానువాళ్ళ మీదకు ఒక్కడూ వెళ్లడానికి జంకేడు. ఆఖరుకి గుర్రాలన్నీ పరుగెత్తి పోయేయి. వాటికి వెనక ఒక ఏభైగజాలదూరంలో ఒక గుర్రం కుంటుతూ నెమ్మదిగా వస్తూంది. బహుశా దానికాలు విరిగి వుంటుంది. దానిమీద నున్న జపానువాడిని చూడడంతోనే గూనివానికి ఆవేశం ఆగిందికాదు. ఒక్క ఉరుకుతో ముందుకువచ్చి బలంకొద్దీ జపానువాడి తలకు గురిపెట్టి రాయి విసిరేడు. ఆ రాతి విసురును ఆపుకోలేక తానూ బోర్లపడ్డాడు. జపానువాడు ఆదెబ్బకు తల దిమ్మెక్కి, క్రింద పడిపో

చేసేడు. గూనివాడు వెంటనే లేచి మతిలేనివాడిలా జపానువాడి గుండెల మీద కూర్చుని, పిడికిళ్లతో ముక్కూ మొహం చితకబొడిచేసేడు. జపాను వాడు గిలగిల తన్నుకోవడంలో వాడిచేతులోని రివాల్వరు పేలింది. గూనివాడు వెల్లకిలా పడిపోయేడు. జపానువాడు చచ్చిపోయేడు.

కమేండరూ, మిగిలినవాళ్లూ, పొదలమాటునుంచి బయటకువచ్చి నాలుగు వెదురుకంప కట్టలు వెలిగించి నాలుగుమూలలా చూసేరు. వారికి పక్కనే గోధుమచేలల్లో మేస్తూన్న గుర్రం కనపడింది. ఇంకోచోట మూడు రివాల్వర్లు పడివున్నాయి. కమేండరు రివాల్వర్లుతీస్తూ "ఫర్వా లేదు. మనం వొచ్చినపని ఊరికేపోలేదు" అన్నాడు. "కాని, ఒక్క జపానువాడినికూడా చంపలేకపోయాం."

ఆతడు అక్కడినుంచి గుర్రం దగ్గిరికి వెళ్ళి కళ్లెంపట్టుకుని తీసు కొచ్చేడు. మంగోలియాజాతి గుర్రం అది. మంచిదే. దానివెన్ను చరుస్తూ కమేండరు డొక్కలు నొక్కిచూసేడు.

"జపాను వాళ్ళని మొయ్యడంకన్న మంచిపనిలోనే పెడతాంలే. ఒళ్లు లాగుదువుగాని. మా గూనివాడు నిన్నుచూస్తే మరి వదలడు. పొలం పని చేసే జంతువులంటే అతనికి ఎంతో ప్రేమ." అంటూ ఆతడు వెనక తిరిగి, "ఓ మామా ! గూనిమామా ! నీకో స్నేహితుడు దొరికేడు చూడు. రా." అని పెద్దకేక పెట్టేడు.

సమాధానం లేదు.

వెలుగువేస్తూన్న వారిలో ఒకడు వచ్చి "గూనిఅన్న కనబడ్డం లేదు." అని చెప్పేడు.

కమేండరు అదిరిపాటుతో గుర్రాన్ని వదిలి ఇవతలికి వచ్చాడు.

"నాలుగుమూలలూ వెతకండి. పాపం ఏమయ్యాడో."

కమేండరు గూనివాణ్ణి కూర్చోమన్న రాతిబండవద్దకు పరుగె త్తేడు. దారిలో ఒక జపానువాడు చచ్చిపడి వుండడం ఆతనికి చాలా

ఆశ్చర్యం కలిగించింది. వాని ప్రక్కనే గూనివాడు పడివున్నాడు. ఆతని గుండెలనుంచి రక్తం కారుతూంది.

"మామా !"

మాటలేదు. ఆతనిమీద వొంగి చెవిలో మళ్ళా "మామా!" అని కేకపెట్టేడు.

ఊఁ హూఁ. అతనికళ్ళు మూతలుపడి వున్నాయి. రక్తం పోవడం చేత ముఖం తెల్లగా కనబడుతూంది. చేతులు రెండూ రెండువేపులకూ చాచివున్నాయి. ఆతని గుండెలమీద చెయ్యి పెట్టి చూచేడు. చాలా నెమ్మదిగా, ఉందా లేదా అన్నట్లు గుండె కొట్టుకుంటూంది.

దళాధిపతికి ఇప్పుడు అర్థంఅయింది. ఈ ఘటనను ఆతడు వూహించి వుండలేదు. ఇంతపనిని ఈ రైతువాడు చేస్తాడని అంతకన్నా వూహించలేదు. తనవాడిప్రక్క పడివున్న జపానువాణ్ణి చూస్తూంటే ఆతనికి ఆవేశం కలిగింది

"మామా! లే. నీపెళ్లానికి ఏం చెప్పమంటావు ?" అని ఆతని చెవిలో శక్తికొలదీ అరిచేడు.

చాలసేపటికి గూనివాడు కళ్లుతెరిచేడు. బాధకి పళ్లు గిట్టకరుచుకుంటున్నాడు. మనిషికి స్మృతిలేదు. వినబడీ వినబడనట్లు నెమ్మదిగా సంధిమాటలు మాట్లాడుతున్నాడు. "కాకమ్మా ! అన్నంమీద మూతపెట్టు. ....ఎలకలు పాడుచేస్తాయి.... పాలు.... చన్నీళ్ళలోపెట్టు.... పులవనీకు ....ఊఁ.... ఊఁ...."

రెండు ఎగుపులు వచ్చేయి. ముఖం శాంతపడింది. చలనం ఆగిపోయింది. అంతే.

కమేండరుకి మనస్సులో చెప్పలేని బాధ కలిగింది. గూనివాణ్ణి లేపుతున్నట్లు నుదురుమీద చెయ్యిపెట్టి వూపేడు.

"మామా! క్షమించు. నీ శాల్యూటు జపానువాళ్ళ పద్ధతిలో వుందన్నాను. క్షమించు. నిన్ను అవమానించడంకోసం అనలేదు, ఆ మాట. అసలు జపానువాళ్ళ శాల్యూటు ఎల్లావుంటుందో నాకు తెలియదు. క్షమించు...."

తన మిత్రుడు పరలోకం పోయేముందు తనని క్షమించేనంటాడేమోనని ఆతడు పశ్చాత్తాపంతో, విచారంతో నిదానించి విన్నాడు.

కాని, ఆతని ఆక్రోశానికి సమాధానం ఏమీ రాలేదు.

# ప్రెలకు దొరకు గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | విప్లవ సందేశం (3 కూర్పు) | 0–8–0 |
| 2. | లెనిన్ ఉపదేశాలు (2 కూర్పు) | 1–0–0 |
| 3. | రష్యా విప్లవం 1905 | 0–12–0 |
| 4. | ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర (2 కూర్పు ఒకేసంపుటి) | 1–4–0 |
| 5. | బలిదాన్ (సోవియట్ నాటకం) | 1–0–0 |
| 6. | సోవియట్ ప్రజాస్వామ్యం | 0–12–0 |
| 7. | నాద్యా (వివిధదేశాల కథలసంపుటి) | 1–0–0 |
| 8. | లెనిన్ జీవితకథలు (14 బొమ్మలతో-పిల్లలకు) | 1–0–0 |
| 9. | టాల్‌స్టాయ్ కథలు (పది కథలు) | 1–8–0 |
| 10. | గోర్కీ కథలు (ఆరు కథలు) | 1–8–0 |
| 11. | యక్ష ప్రశ్నలు (చిక్కు ప్రశ్నలు-శాస్త్రీయ సమాధానాలు) | 1–8–0 |
| 12. | డిప్యూటీ ఛైర్మన్ (చీనా విప్లవకథలు) | 1–0–0 |

అధునిక ఆంధ్ర గ్రంథాలన్నీ మావద్ద దొరుకుతాయి. పుస్తక వ్యాపారులకు 25%, లైబ్రరీలకు $12\frac{1}{2}$% కమీషన్ యిస్తాము.

రు 5/- లకు మించిన మా ప్రచురణములు తెప్పించే యితరులందరికి పోస్టుఖర్చులన్నీ మేమే భరించి పంపుతాము. పుస్తకాల ఖరీదు మాత్రమే ముందు మనియార్డరుగా పంపాలి.

పంత్రెండు సంవత్సరాలుగా ఆంధ్రభాషాసేవ చేస్తూన్న మాకు విజ్ఞులందరూ చేయూత యిస్తారని కోరుతున్నాం.

విశ్వసాహిత్యమాల,
అవంతీ ప్రెస్ బిల్డింగ్స్ - రాజమండ్రి.